24.2.1995 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి : 67 సంచిక : 8, విడిప్రతి : రు. 2.00 లు

Phone : 27354. Regd No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు

జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

NEELIMA TOWERS
A.C. CENTRE, NELLORE - 524 001. PH: 23113
మా కాంప్లెక్స్‌లో వ్యాపారమునకు అనువైన షాపు రూములు నిర్మించి ఇవ్వబడును.
సంప్రదించండి

"అబ్బ నుమేలన్పించావురా...." అన్నట్లుంది జిల్లాలో తెలుగుదేశం పరిస్థితి!

# సీట్ల దగ్గరే జుట్లు పట్టుకున్నారు!

## ఓటమి తెలిసీ పోటీ చేయాల్సి రావడంతో కాంగ్రెస్ వాదులు ఇళ్లలో దాక్కున్నారు!

జిల్లాలో మండల, జిల్లా పరిషత్ ఎన్నికల రంగం గందరగోళంగా వుంది. నామినేషన్ల ఉపసంహరణ నిన్నటితో (23తేది) ముగిసినా ఏ ఏ మండలంలో ఎవరు పోటీ చేస్తున్నారో, ఎక్కడెక్కడ ఎవరెవరు పోటీ పడుతున్నారో అర్థమే కావడం లేదు. అగమ్య గోచరంగా వుంది పరిస్థితి.

రెండు పార్టీలు కూడా మండల, జిప్రప నియోజక వర్గాలకు అభ్యర్థుల ఎంపికను ఆయా శాసన సభ్యులు, ఓడిపోయిన ఎమ్మెల్యే అభ్యర్థులకు వదలి పెట్టడంతో నిర్ణయాలన్నీ స్థానికంగా జరిగిపోయాయి. నెల్లూరు వరకు సమాచారం చేరడం లేదు. ఇంకొక ప్రక్క మండలాధ్యక్షుడి ఎంపికకోసం గ్రామ స్థాయిలో పోటీచేసే అభ్యర్థులకూ టిక్కెట్లు పెట్టడంతో, ఆ స్థానాల సంఖ్య వందలలో వుండడంతో, దూరంగా వుండి చూసే వారికి ఏది ఏదో అర్థంకాకమరీ గందరగోళంగా వుంది. మండలానికి ఎవరో, జిల్లాపరిషత్‌కు ఎవరో తెలియడంలేదు. రిజర్వేషన్లు మరొక కన్‌ఫ్యూజన్. ఏ ఉద్దేశ్యంతో పంచాయితీ రాజ్ చట్టాన్ని మార్పు చేశారో కాని, దాన్ని రూపొందించిన వారికి జోహార్లు చెప్పాలి!

## మండల ఎన్నికలు భలేగున్నాయి!

సహజంగానే తెలుగుదేశంలో టిక్కెట్ల పంపకానికి మంచి గిరాకీ ఏర్పడింది. టిక్కెట్ వస్తే చాలు గెల్చిపోయినట్లేనన్న అభిప్రాయం, ఆశ ప్రబలి పోవడంతో టిక్కెట్ల కోసం తన్నుకుని చచ్చారు; జుట్లు జుట్లు పట్టుకొని కొట్టు కున్నారు. జిల్లాలో ఎమ్మెల్యే లందరికీ తమ పదవులే కొత్త; ఆ మైకం నుంచే వారు కోలుకో లేక పోతున్నారు. దానికి అదనంగా తమ చేతులమీదుగా పదవులు పంచిపెట్టే అవకాశం లభించడంతో దాన్ని జీర్ణించుకోవడం వారి తరం కాలేదు. ఒక్కొక్క ఎమ్మెల్యే ఇల్లు ఈ పదిరోజులూ ఒక్కొక్క తీరులో వుండింది. అభ్యర్థనలు, ఆవేశాలు, ఏడ్పులు, మొత్తుకోళ్లు, అలుకలు, ఆగ్రహాలు, బెదరింపులు, భయ పెట్టడాలతో తిరునాళ్ల సందడిగా వుండింది. నామినేషన్ల ఉపసంహరణకు చివరి క్షణం సమీపించినంత దాకా చాలా చోట్ల అభ్యర్థులను తేల్చి చెప్పలేక ఎమ్మెల్యేలు సతమత మైనారు; ఇంకొక ప్రక్క సిపిఎంతో చర్చలు తెగక అయోమయంలో పడ్డారు. 23తేది మధ్యాహ్నం రెండు గంటల సమయంలో బోగోలు, కొడవలూరు, ఉదయగిరి మండలాలు సిపిఎంకు ఇవ్వడానికి ఒప్పందం కుదిరింది. జిప్రప విషయంలో అప్పటికరీ తేలలేదు.

## టిక్కెట్ వస్తే గెల్చినట్లేనన్న భావంతో తెలుగుదేశం నాయకులు పోటీలు పడ్డారు!

చాలా మండలాలలో టిక్కెట్ల విషయంలో రచ్చలు రావిళ్లు జరిగాయి. తోటపల్లి గూడూరుకు మోహన్‌చౌదరి అనే విజార్పయిన తెలుగు కార్యకర్తకు టిక్కెట్ ఇవ్వమని ఎన్‌టిఆర్ సిఫార్సు లేఖ ఇచ్చారట. జిల్లా కమిటీ కన్వీనరు శ్రీ తీగా నారసింహారెడ్డి ఆ ప్రకారం అతడికి బీఫారం ఇచ్చారు. ఇది తెలిసి, తన రాజ్యంలో తనకు చెప్పకుండా టిక్కెట్ ఎట్లా ఇస్తారని ఎమ్మెల్యే శ్రీ సోమిరెడ్డి

కొరవ 7 పేజీలో





ప్రపంచ స్థాయిలో నాణ్యతగల
ప్రియా సిమెంట్ వారి
బంగారు కానుక!
ప్రియా గోల్డ్
OPC 53 గ్రేడ్
మామూలు సిమెంట్ కంటే శక్తివంతమయిన
మెగా సిమెంట్
Priyadarshini Cement Ltd
IS:12269
Priya GOLD
OPC 53 GRADE
ORDINARY PORTLAND CEMENT
సిమెంట్ రంగంలో రారాజు
S V S COMPLEX, NEAR MADRAS BUS STAND, ACHARI STREET, NELLORE - 3.

# షేర్ హోల్డర్ల నష్టం లక్షా 50 వేల కోట్లు!

## పరిస్థితి ఇంత ఆందోళనకరంగా వున్నా ఆర్థిక శాఖలో చలనం లేదు!

షేర్ల మార్కెట్ పతనం రుజువైపోయింది; . ఖరారైపోయింది. బొంబాయి సెన్సెక్స్ 3200 కనిష్ఠ స్థాయికి పడిపోయింది. మ్యూచువల్ ఫండ్స్ కాని, సంస్థాగత పెట్టుబడి దారులు కాని మార్కెట్‌లో జోక్యం చేసుకోవడం లేదు. సాధారణంగా ఇటువంటి సమయాలలో వీరు కొత్తగా కొనుగోళ్లు చేయడం ద్వారా మార్కెట్‌ను నిలబెట్టడానికి ప్రయత్నిస్తుంటారు. కాని ఇప్పుడటు వంటిదేమీ జరగడం లేదు. రాజకీయ అనిశ్చిత పరిస్థితులు ఇటు పెట్టుబడి దారులను, అటు స్టాక్ మార్కెట్ నిర్వాహకులు, బ్రోకర్లను గందరగోళ పరుస్తున్నాయి; వారిలో నైతిక సామర్థ్యం క్షీణించి పోతున్నది. ఆరు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు ఎట్లా వుంటాయో వూహాకందడం లేదు. మార్చి మధ్యవారానికి కాని వాటి సంగతి

> **షేర్ మార్కెట్ పతనం ఆపకుంటే పారిశ్రామిక ప్రగతి, దేశాభివృద్ధి స్తంభించి పోతాయి; మ్యూచ్యువల్ ఫండ్స్ ముందుకు వస్తేనే ఫలితం!**

తెలదు. ఈ లోగా మార్కెట్‌లో పలు రకాల పుకార్లు రాజ్యం చేస్తున్నాయి. రిలయన్స్ అధినేత ధీరూభాయి అంబాని ప్రమాదకర రీతిలో అనారోగ్యం పాలైనారన్న పుకారు ఒకటి అందర్నీ భయపెట్టింది. నిజానికి అంబాని ఆ సమయంలో తన ఆఫీసులో కూర్చుని పని చేసుకుంటున్నారు. ఆయనకు ఏ అనారోగ్యమూ లేదు. మార్కెట్ బలహీనంగా వున్నప్పుడు ఇటువంటి సంఘటనలు సర్వసాధారణం. ఇవి మార్కెట్‌ను తాత్కాలికంగానైనా సరే మరింత కృంగ దీస్తాయి.

షేర్ మార్కెట్ పతనం వల్ల పెట్టుబడిదారులు దాదాపు లక్ష 50వేల కోట్ల రూపాయలకుపైగా నష్టపోయారు. మార్కెట్ క్యాపిటలైజేషన్‌లో మూడవ వంతు విలువ కోల్పోవడం వల్ల ఈ దారుణ నష్టం సంభవించింది. గతంలో హర్షద్ మెహతా కుంభకోణం వల్ల ఒకసారి షేర్‌హోల్డర్లు రెండు లక్షల కోట్లకు పైగా పోగొట్టు కున్నారు. ఇప్పుడు రాజకీయ అనిశ్చిత పరిస్థితులువారిని నిలువు దోపిడీ చేశాయి. షేర్ హోల్డర్లలో సాధారణ ప్రజల నుంచి సంస్థాగత పెట్టుబడిదార్లు, మ్యూచువల్ ఫండ్‌లు, బ్రోకర్లు తదితరులందరూ వున్నారు.

దారులు తమ జీవిత కాలపు పొదుపు ద్రవ్యాన్ని, మూలధనాన్ని కోల్పోతున్న విషమ పరిస్థితులలో వారిని కాపాడే ప్రయత్నం చేయడం ప్రభుత్వ కనీస ధర్మం.

షేర్ల ధరలు పడిపోతే నష్టపోయేది వినియోగదారుడు ఒక్కడు కాదు. షేర్లకు విలువలేనప్పుడు, క్యాపిటల్ మార్కెట్‌లో పెట్టుబడి పెట్టే వారుండరు. దీనివల్ల కొత్త పరిశ్రమల స్థాపన కాని, వున్న పరిశ్రమల విస్తరణ కాని దెబ్బతింటాయి. పారిశ్రామిక ప్రగతి పెద్ద కుదుపుకు లోనౌతుంది. ఆర్థిక సంస్కరణలు వెనక్కు పోతాయి. దీనివల్ల పెట్టుబడి

ఇటీవలి కాలంలో దేశంలో షేర్ హోల్డర్ల సంఖ్య విపరీతంగా పెరిగింది. 1991లో షేర్ హోల్డర్లు 25 లక్షలని అంచనా. ఇప్పుడు ఆ సంఖ్య 2కోట్లా 50లక్షలని చెప్తున్నారు. అంటే షేర్ మార్కెట్‌లో పాల్గొనేవారి సంఖ్య నాలుగేళ్లలో పదిరెట్లు పెరిగిందన్నమాట. ఇండియా వంటి వర్ధమాన దేశంలో ఇది సాధారణ పెరుగుదలకాదు. ఇంతమంది ప్రజల పెట్టుబడితో ఆర్థిక సంస్కరణలకు, పరిశ్రమల ప్రగతికి ప్రాణం పోశాము మనం. ఇటువంటి పరిస్థితిలో షేర్ హోల్డర్లు నష్టపడటమంటే దేశం నష్టపడినట్లే లెక్క.




అయితే దురదృష్టవశాత్తు ఆర్థిక విధాన రూప కర్తలు కాని, కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ కాని ఈ దారుణ పతనాన్ని ఏమాత్రం పట్టించుకోవడం లేదు. విదేశీ మారక ద్రవ్య నిల్వలు కొద్దిగా తగ్గినా, రిజర్వు బ్యాంకుకు విదేశీ డిపాజిట్ల ప్రవాహం ఏమాత్రం నిల్చినట్లు కన్పించినా అత్యవసర స్థితి వచ్చినట్లు ఆగం చేసి, హడావుడి నిర్ణయాలు తీసుకొనే ఆర్థిక మంత్రిత్వ శాఖ, షేర్ మార్కెట్ ఇంతగా పతనమై పోతుంటే మౌనంగా చూస్తూ వుండి పోవడం అన్యాయం. రెండున్నర కోట్ల మంది పెట్టుబడి దార్లలో విశ్వాసం సన్నగిల్లుతుంది. ఫలితంగా ఆయిల్ అన్వేషణ, విద్యుత్, కమ్యూనికేషన్లు తదితర వేల కోట్ల రూపాయల పెట్టుబడి అవసరమైన ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ పరిశ్రమల స్థాపన కష్ట సాధ్యమౌతుంది. ప్రజల పాత్ర లేకుండా వీటిని స్థాపించడం ప్రభుత్వ తరం కాదు. లిక్విడిటీ లోపిస్తుంది. ఈ ప్రమాదాన్ని పసిగట్టి కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ జోక్యం చేసుకొని యుటిఐ, ఎల్ఐసి, జిఐసి, మోర్గాన్ స్టాన్లీ, రిలయన్స్ క్యాపిటల్ వంటి సంపన్న మ్యూచువల్ ఫండ్స్ ద్వారా కొనుగోళ్లు జరిపిస్తే స్టాక్ మార్కెట్ ఇప్పటి సంక్షోభం నుంచి బయటపడుతుంది. మార్కెట్‌లో లిక్విడిటీ సమస్య తీరుతుంది.

# బడ్జెట్ వల్ల లాభపడే షేర్లు మాత్రం కొనడం శ్రేయస్కరం!

పరిస్థితులు ఏమాత్రం అనుకూలంగా లేవు. రానున్న ఏడాది కాలంలో ద్రవ్యోల్బణం 10నుంచి 11శాతం మధ్య వూగిస లాడటం తప్ప, తగ్గే సమస్యే లేదని ఆర్థిక నిపుణులు అంచనా వేస్తున్నారు. అందువల్ల ఆర్థిక సంస్కరణలు వెనుదిరిగే ప్రమాదం వుంది. 1996 పార్లమెంటరీ ఎన్నికలు సమీపించి నందువల్ల ప్రజాకర్షక పథకాల కోసం ప్రభుత్వం నిధులు వెచ్చించవలసి రావడంతో రానున్న బడ్జెట్ లోటు భారీగా వుంటుంది. దీనికి తోడు వాన దేముడు కరుణించకుంటే ఆర్థిక సమస్యలు మరీ పెరిగిపోతాయి. అదే జరిగితే విదేశీ భారతీయులు తమ నిధులను భారత దేశానికి పంపడంపై పునరాలోచన చేస్తారు. అదే జరిగితే రిజర్వు బ్యాంకు విదేశీ మారక ద్రవ్య సమస్యను ఎదుర్కొంటుంది. ఇటువంటి అనిశ్చిత స్థితులు షేర్ మార్కెట్‌కు ఏమాత్రం అనుకూలం కావు. షేర్ల ధరలు ఇంకా తగ్గే ప్రమాదం వుంటుంది.

అయితే ఇవన్నీ జరుగుతాయన్న వూహ తప్ప, జరగాలని రూలేమీ లేదు. ఇటువంటి అనిశ్చిత పరిస్థితులను ఎదుర్కొనే మౌలిక సామర్థ్యం మన పరిశ్రమలు సంతరించుకున్నాయనే భావించాలి. గత మూడేళ్లుగా అధిక భాగం పరిశ్రమలు ఏమాత్రం దెబ్బ తినకుండా శరవేగంతో అభివృద్ధి సాధిస్తున్నాయి; లాభాలు ఆర్జిస్తున్నాయి. సమస్యలు పైన వివరించినంత తీవ్ర రూపం ధరించకుంటే, ఫండమెంటల్‌గా స్థిరంగా వుండే పరిశ్రమలషేర్లు తమ విలువను 20నుంచి 30 శాతం వరకు పెంచుకొనే అవకాశం వుంది.

అందువల్ల బడ్జెట్‌ను పూర్తిగా పరిశీలించిన తర్వాత కాని షేర్ల జోలికి పోకుండా వుండడం వుత్తమం. బడ్జెట్ వల్ల లాభపడే పరిశ్రమలేవో గుర్తించి, పిఇరేషియో తక్కువగా, ఇపిఎస్ ఎక్కువగా అభివృద్ధి క్రమం తప్పకుండా వుండే పరిశ్రమల షేర్లు కొనడం లాభదాయకం. బడ్జెట్ వరకు షేర్ల జోలికి పోకుండా వుండడం వుత్తమం.

### వడ్డీరేట్ల పెంపు-లాభాలపై ఒత్తిడి

స్టాక్ మార్కెట్ పతనంతో, ద్రవ్యోల్బణం పెరుగుదలతో బ్యాంకులు తమ వడ్డీరేట్లను పెంచుతున్నాయి. స్టేట్ బ్యాంకుతో సహా అన్ని బ్యాంకులూ ఈ అవకాశాన్ని వాడుకొంటున్నాయి. బ్యాంకు వడ్డీరేట్లు పెరగడం వల్ల కంపెనీల లాభాలు తగ్గిపోతాయి. దీనివల్ల కూడా పరోక్షంగా షేర్ మార్కెట్‌లో ధరలు క్షీణించే ప్రమాదం వుంది.

### పబ్లిక్ ఇష్యూలకు బ్యాంకు అప్పులు

షేర్ మార్కెట్ పతనం కొత్తగావచ్చే పబ్లిక్ ఇష్యూలపై కూడా ప్రసరిస్తున్నది. భారత దేశంలో గత నాలుగైదేళ్ల నుంచి పబ్లిక్ ఇష్యూలపట్ల షేర్ హోల్డర్లు విపరీతంగా ఆకర్షితులౌతున్నారు. గత రెండేళ్లలో దాదాపు 60వేల కోట్ల రూపాయల మూలధనం ప్రజల నుంచి సేకరింప బడి వుంటుందని అంచనా. ఇంతింత పెద్ద మొత్తంలో డబ్బు చెల్లించినప్పటికీ ప్రజలు ఇంకా కొత్త ఇష్యూలపట్ల వెనుకాడడం లేదు. ఒక నెల రోజుల క్రితం వరకు చాలా కంపెనీల ఇష్యూలు పదిరెట్లకు పైగా

తరువాత 8 పేజీలో


## శుభాకాంక్షలు

వినయుడు, కార్యశీలి, స్నేహశీలి, మా శ్రేయోభిలాషి, హోటల్స్ అభివృద్ధి కోసం అహర్నిశలు కృషి చేస్తున్న వ్యక్తి, అయ్యప్ప సేవా సమాజం ప్రెసిడెంటు

**శ్రీ ఎమ్.ఎస్. పరమేశ్వరన్ (రాజు)**

7.2.95న ఆంధ్రప్రదేశ్ హోటల్స్ అసోసియేషన్ వైస్ ప్రెసిడెంటుగా ఏకగ్రీవంగా ఎన్నికైన సందర్భమున

ఇవే మా హార్దిక శుభాకాంక్షలు

హోటల్ సన్నిదానం
జి. చంద్రస్వామి
జి. శేషగిరి రావు

స్వామి అయ్యప్ప సేవా సమాజం, నెల్లూరు
స్వామి అయ్యప్ప దేవస్థానం సిబ్బంది
నెల్లూరు మళయాళీ అసోసియేషన్

# విద్యుత్ వేలం

రాష్ట్ర ప్రభుత్వం ఒకే రోజు 11 వేల 210 కోట్ల రూపాయల విలువ కల్గిన విద్యుత్ ప్రాజెక్టులను ప్రైవేట్ సంస్థలకు అప్పచెప్పి అవినీతి అధ్యాయంలో కొత్త చరిత్రను సృష్టించింది. స్వచ్ఛమైన పరిపాలన, నిష్కళంక ప్రజాసేవకు నమూనాగా వ్యవహరిస్తామని ప్రజలకు వాగ్దానం చేసిన తెలుగుదేశం ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు గారు అవినీతి విషయంలో బరితెగించినట్లు ప్రవర్తించి ప్రజల ఆశలను వమ్ము చేశారు.

18 తేది అర్ధరాత్రి రాష్ట్ర ప్రభుత్వం 23 విద్యుత్ ప్రాజెక్టులను ఆమోదిస్తూ, సంబంధిత ప్రైవేటు కంపెనీలతో ఒప్పందాలు కుదుర్చుకొన్నది. ఈ ఒప్పందాల విషయంలో ఎటువంటి నియమ నిబంధనలూ పాటించలేదు. దాదాపు 65 ప్రాజెక్టులకు ప్రభుత్వం దగ్గర ఎప్పటి నుంచో ధరఖాస్తులు పడి వుండినాయి. 18 తేది వారిలో టెలిఫోన్ ద్వారా అందుబాటైన కంపెనీలను పిలిపించి, అరకొర చర్చలు జరిపి, అర్ధరాత్రి సమయంలో ఒప్పందాల పై సంతకాలు పెట్టించేశారు. ఈ 23 ప్రాజెక్టులలో ఒక కంపెనీ నాలుగింటిని, మరొక కంపెనీ రెండింటిని చేజిక్కించు కున్నాయి.

సాధారణంగా ఇటువంటి ప్రాజెక్టులను ప్రైవేటు వ్యక్తులకు అప్పచెప్పేటప్పుడు పత్రికలలో విస్తృతంగా ప్రచారం చేసి, పోటీ దారులను ఆహ్వానించి, వారి ఆర్థిక స్తోమత, సాంకేతిక నిపుణత, యాజమాన్య సామర్థ్యం తదితరాలు పరిశీలించి, ఎవరు తక్కువ ధరకు ప్రాజెక్టులు నెలకొల్ప గలరో వారికి అప్పచెప్పడం సాంప్రదాయం. కాని ఈ 23 ప్రాజెక్టులకు సంబంధించి అటువంటి నియమాలేవీ పాటించల్లేదు. కనీసం ప్రాజెక్టు వ్యయం క్రింద ఆయా కంపెనీలు సూచించిన మొత్తం న్యాయ బద్ధమో, కాదో ఆలోచించలేదు. కంపెనీలు చెప్పిన ధరకు ఒప్పందాలు చేసేశారు. దీనివల్ల ఆ కంపెనీలు తాము సరఫరా చేసే విద్యుత్ ధరను తమ ఇష్టం వచ్చినట్లు నిర్ణయిస్తాయి. ఆ భారమంతా ప్రజలు మోయ వలసి వుంటుంది. విద్యుత్ వినియోగ దారులు ఏటా కొన్ని వేల కోట్ల రూపాయలు నష్ట పోవలసి వుంటుంది.

రాష్ట్ర ప్రజలందరికీ సంబంధించిన ఒక ప్రధాన విధాన నిర్ణయం విషయంలో ముఖ్యమంత్రి అంత హడావుడిగా ఎందుకు వ్యవహరించారు? దీనికి ఆయన ఇస్తున్న వివరణ సంతృప్తికరంగా లేదు. ఫిబ్రవరి 18 లోగా ఒప్పందాలు కుదుర్చుకున్న వారి వివరాలు ఇమ్మని కేంద్రం ఆదేశించింది కాబట్టి, ఆలస్యమై పోతుందనే భయంతో హడావుడిగా ఒప్పందాలు చేసుకున్నామని ఎన్‌టిఆర్ చెప్తున్నారు. ఇది అర్థం లేని వివరణ. ఫిబ్రవరి 18లోగా ఒప్పందాలు చేసుకొని వుంటే వాటిని యదాతథంగా అమలు చేసి, ఆ తర్వాత ఇచ్చే ప్రాజెక్టులన్నీ టెండర్లు పిల్చి, కాంపిటేటివ్ బిడ్డింగ్‌ల ద్వారా మాత్రమే కేటాయించాలని కేంద్రం ఆదేశించింది. లేని ఒప్పందాలను సృష్టించి, ప్రైవేటు వ్యక్తులకు ప్రాజెక్టులను అమ్మమని కేంద్రం చెప్పలేదు. టెండర్ల పద్ధతిలో ప్రాజెక్టులను కేటాయిస్తే వాటి వ్యయం తగ్గి, వినియోగ దారుడికి విద్యుత్ చవకగా లభించే అవకాశం ఏర్పడుతుంది కదా?

ఎన్నికల సమయంలో ఎన్‌టి రామారావు గారు జగం చేసిన కృష్ణాపట్నం విద్యుత్ కేంద్రం కాంట్రాక్టు విషయంలో అప్పటి ప్రభుత్వం పాటించిన కనీస నియమాలను కూడా ఇప్పుడు పాటించలేదు. టెండర్లు పిల్చి, ప్రాజెక్టులు అప్ప చెప్తే తమకు వ్యక్తిగతంగా ఏ లాభమూ చేకూరదన్న భయంతోనే తెలుగుదేశం నాయకులు అర్ధరాత్రి సమయంలో ఇంత పచ్చిగా విద్యుత్ ప్రాజెక్టులను వేలం పెట్టి విక్రయించారన్నది బహిరంగ సత్యం. ఒక్కొక్క కంపెనీ నుంచి కొన్ని కోట్ల రూపాయల ముడుపుల స్వీకారానికి తెర వెనుక ఒప్పందాలు కుదిరాయన్న ఆరోపణను త్రిప్పి కొట్టేందుకు ముఖ్యమంత్రి దగ్గర సమాధానం లేదు. 65 దరఖాస్తులలో కేవలం 23 ప్రాజెక్టులను మాత్రం పరిశీలించి, తక్కిన వాటిని సరైన కారణాలు లేకుండా తిరస్కరించి, సమయానికి వారు దొరకలేదనే కుంటి సాకు చూపి అదీ ఒక్కొక్కరికి నాలుగు, రెండు లెక్కన పంచి పెట్టడంలోని అంతరార్థం అవినీతి తప్ప వేరేమి కాదు.

ప్రభుత్వం ఇప్పటికైనా తమ తప్పును గ్రహించి, ఈ ఒప్పందా లన్నింటినీ రద్దు చేయడం మంచిది. ఆలస్యాన్ని నివారించ దలిస్తే తక్షణం టెండర్లు పిల్చి, సమర్థత, స్తోమత కల్గిన వారికి ప్రాజెక్టులను అప్పగించవచ్చు. ఒప్పందాల పై సంతకం పెట్ట వలసిన ఇంధన శాఖ కార్యదర్శి, ఈ అవినీతి భాగోతాన్ని సహించలేక, వాటిని నివారించనూ లేక అప్పటికప్పుడు సెలవు పై వెళ్లి పోవడాన్ని ఇక్కడ ప్రత్యేకంగా గమనించాలి.

అధికారంలోకి వచ్చిన మూడు నెలల్లోనే తెలుగుదేశం ప్రభుత్వం ఇంత భారీ కుంభకోణంలో కూరుక పోవడం విషాదకరం. ఇటువంటి సంఘటనల వల్ల ప్రజలకు రాజకీయ వాదుల పైన, ప్రజాస్వామ్యం పైన విశ్వాసం సడలిపోయే ప్రమాదం వుంది.



23 -2 - 1945
పేజీలు, 10, వెల. 0-1-6

### ఉంగరంలో ఇమిడే కాశ్మీర్ శాలువ

బ్రిటిష్‌వారు రాకముందు మన ఢక్కా మున్నగు పట్టణాలలో నేతగాండ్రు, అగ్గిపెట్టెలో ఇమిడే సన్నని చీరెలు నేసేవారని. ఆ నేతపని వారి చాతుర్యాన్ని ఈస్టిండియా కంపెనీ చంపేసిందని మన చరిత్ర చెబుతోంది. ఎంత జేసినా మన నేతవారి శక్తి అణచరానిదని తిరిగి యీనాడు కాశ్మీర్ చేనేత కార్మికులు నిరూపించారు.

ఒక చిన్న వుంగరంలో ఇముడునంతటి సన్నని శాలువాను ఇటీవల కాశ్మీర చేనేత కార్మికుడొకరు తయారు చేశాడు. దాని బరువు 50 తులాలు!

లంకాషైర్, మాంఛెస్టర్ మిల్లులుగూడ చేయలేని ఘనకార్యమును ఒక ఇంట్లో, మగ్గం రాటములముందు కూచుని, భారతీయ చేనేత కార్మికులు సాధించారు. గ్రామ పరిశ్రమలకే అవకాశం,ప్రోత్సాహం వుంటే మిల్లు గుడ్డల కన్నా మేలురకమైన గుడ్డలే తయారౌతాయనుట అది నిదర్శనమే గదా?

### నేటి వెంకటగిరి పరిస్థితులు

మర్యాదయిచ్చి తీసుకో మన్నారు. తన చేతి క్రింది నౌకర్లను గూడ కూర్చోబెట్టి మాట్లాడుతారు. నేటి నాగరిక ప్రపంచంలో చదువుకున్నవారు. జమీందారీ దివాణాల్లో యీనాటికి యీ సంప్రదాయం తెలియక పోవడం విచారకరం. తాము జీతం యిచ్చే నౌకర్లవిషయం వేరు. లోకానికి బువ్వ పెట్టే రైతుల విషయం వేరు. ఈమధ్య మహరాజ్ కుమార్‌తో సంప్రదించడానికి పోయిన వెంకటగిరి తాలూకా రైతు ప్రతినిధులను గంటలకొలది నిలబెట్టి మాట్లాడినారట. తాము సింహాసనం మీద సుఖాసీనులై కూర్చొని.

**50 ఏళ్లక్రితం ఈవారం**

రైతులను ఈ విధంగా నిలబెట్టి అవమాన పరచడం సభ్య ప్రపంచం ఒప్పుకోదు. ఒకటి రెండుమార్లు చూచి మూడోదఫా వెంకటగిరి తాలూకా రైతు సంఘూర్యకులు కార్తిరెడ్డి వెంకటసుబ్బారెడ్డిగారు "ఘంటలకొలది మాకీ మకీ ఖైదు ఏమిస్వామీ" అని అడిగాడట. దాన్తో మహరాజ్ కుమార్ గారి నేత్రాలు యెర్రబారి నిన్నెవడు రమ్మన్నాడని అడిగాడట.

కొరవ 10 పేజీలో

# హరిజన ఎమ్మెల్యేల వీరభక్తి- వీరికి నిజమైన విముక్తి ఎప్పుడు?

రాజకీయాల్లో వుండే వారిని రెండు బ్యాచ్‌లుగా విభజించవచ్చు. దేశం కోసం, సామాజిక శ్రేయస్సు కోసం స్వార్థాన్ని సైతం త్యజించి ప్రజాసేవయే పరమార్థంగా రాజకీయాల్లోకి వచ్చే వారు మొదటి రకం. ఇక వేరే గత్యంతర మంటూ ఏదీ లేక రాజకీయాల్లో కొచ్చే వారు రెండో రకం. సుభాష్ చంద్రబోస్, జయప్రకాష్ నారాయణ, రామ్ మనోహర్ లోహియా మొదటి తరం వారు; అటువంటి వారు నేడు లేరు. ప్రస్తుతం రెండవ రకం నాయకులు మాత్రమే నున్నారు. వారిలో తెలుగుదేశం పార్టీలోని ఎస్‌సి, ఎస్‌టి ఎమ్మెల్యేల గూర్చి ప్రత్యేకంగా చెప్పాలి. ఇటీవల వారంతా కలసి ఎన్టీఆర్ దంపతులను ఘనంగా సన్మానించారు. ఆ సన్మానానికి వెళ్లిన హరిజనులు, గిరిజనులు సిగ్గుతో తలవంచు కోవలసి వచ్చేట్లుండింది వారి ప్రవర్తన. ఎన్టీఆర్‌ను కొందరు కాబోయే ప్రధాని

అంటే; మరి కొందరు ఎన్టీఆర్ అంబేద్కర్ రూపంలో తిరిగి అవతరించినట్లు చెప్పారు. అంబేద్కర్ ఎస్‌సిలను వుద్దేశించి ఇచ్చిన సందేశం ఈ ఎమ్మెల్యేలకు గుర్తులేనట్టుంది. "ఆత్మ గౌరవం కోసం ఎటువంటి త్యాగానికైనా సిద్ధమైతేనే మాకు సిసలైన విముక్తి లభిస్తుందన్నారు". మరి ఈ ఎమ్మెల్యేలకు విముక్తి ఎన్నటికి లభిస్తుందో?

హైదరాబాద్ -డాక్టర్ ఇవి చిన్నయ్య

## జనవాణి

### ఓటర్లు తమ తప్పు దిద్దుకోవాలి!

మొన్న జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో మన రాష్ట్రంలో ఒకే పార్టీకి కుప్పతిప్పలుగా ఓట్లు, సీట్లు లభించాయి. దీనికి కారణం రెండు రూపాయల కిలో బియ్యం. మహిళలు, 18 - 35 మధ్య వయస్సు గల ఓటర్లని పరిశీలకులు తేల్చారు. అయితే ఆ పార్టీ గెలిచాక ఈ వర్గం బావుకున్న దేమీలేదు. కార్డుల ఏరివేత, తిప్పనేతలతో రెండు రూపాయల కిలో బియ్యం పై ఆశ పెట్టుకున్న వాళ్లకు నిరాశే మిగల్చింది. వీరిలో ఎక్కువ శాతం మంది మధ్య తరగతి వాళ్లు, ఓట్లేసిన యువతీ, యువకులు, మహిళలు కూడా ఈ వర్గంలో వారే ఎక్కువ. ఎన్టీఆర్ పదవిలోకి వచ్చింది మొదలుకొని రద్దుల పర్వం ఆరంభమయ్యింది. ప్రస్తుతానికి ఆగి వున్నా, పంచాయితీ, స్థానిక ఎన్నికల తర్వాత ముమ్మర మవుతుంది. ప్రస్తుత ఎన్నికలు ఓటర్లకు బంగారు అవకాశం. చేసిన పొరపాటును ఓటర్లు కొంతైనా దిద్దుకొనేలా ఎన్టీఆర్‌కు బుద్ధి చెప్పాలి. లేకుంటే ఎందరి కార్డులు రద్దయి పోతాయో ఖచ్చితంగా తెలియదు.

నెల్లూరు -బి.వి. రాధాకృష్ణయ్య

### స్థానిక ఎన్నికల రిజర్వేషన్లు - కంటకింపు

స్థానిక ఎన్నికలకు కొత్త

కొరవ 8 పేజీలో

నిర్మల వక్కపొడి

చేతితో తాకకుండా పూర్తిగా యంత్రాల సహాయంతో తయారౌతున్న నిర్మల వక్కపొడి

15 పైసల పొట్లాలు రుచి చూడండి

# రేషన్ కార్డులు నిలవాలంటే కాంగ్రెస్‌కు ఓటు వేయాల్సిందే!

డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే మాదాల జానకిరాం 21తేది ఇందిరాభవన్‌లో విలేఖరులతో మాట్లాడారు. తెలుగుదేశం ప్రభుత్వం అర్హులైన వారికే కార్డులనే పేరుతో ఏరివేత కార్యక్రమం మొదలిట్టిందని; అందువల్ల రేషన్ కార్డులుండాలంటే కాంగ్రెస్‌కే స్థానిక ఎన్నికల్లో ఓటివ్వమని జానకిరాం కోరారు. తెలుగు దేశం ఎమ్మెల్యేలు తమ పరిధులు అతిక్రమించి వ్యవహరిస్తున్నారని, నియోజక వర్గంలో ఏం చేసినా తమకు తెలిసే జరగాలని అధికారులను నిర్దేశిస్తున్నట్లు చెప్పారాయన. ఎన్నికల సమయంలో వున్న అధికారులందర్నీ బదలీ చేశారని, ఆ అధికారులు వున్న సమయంలోనే తాము విజయం సాధించిన విషయం ఎందువల్ల మరచి పోయారో అర్థం కావడం లేదన్నారు. సంజీవ రెడ్డి చమత్కారంగా మాట్లాడుతూ అసెంబ్లీ ఎన్నికల్లో ఘన విజయం సాధించడం దేశం బ్లో అవుట్ కాగా, స్థానిక సంస్థల ఎన్నికల్లో కాంగ్రెస్ తిరిగి విజయం సాధించటం ద్వారా భయంకరమైన బ్లోఅవుట్‌ను అదుపు చేయగలుగుతా మన్నారు. ఆయా ప్రాంతాల్లో నాయకులకు బి ఫారాలు ఇచ్చామని, వారు స్థానిక ఎన్నికల్లో పోటీ చేసే అభ్యర్థులకు అందజేస్తారని తెలిపారు. జిల్లా వ్యాప్తంగా కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తల్లో గెలవాలన్న పట్టుదల కన్పిస్తోందన్నారు. అంతర్గత విభేదాలు తమను వీడి తెలుగుదేశం పార్టీలో చేరాయన్నా రాయన. సమావేశంలో పత్రా ప్రకాశ రావు, వేపూరి దేవకుమార రెడ్డి, మాజీ మండలాధ్యక్షుడు షేక్ షబ్బీర్ పాల్గొన్నారు.

## మునిసిపల్ ఎన్నికల కార్యక్రమం!

నెల్లూరు మునిసిపాలిటీ ఎన్నికల నోటిఫికేషన్‌ను కమీషనర్

## నెల్లూరు సంగతులు

కెప్టెన్ డి.వి. రెడ్డి 20 తేది విడుదల చేశారు. నామినేషన్లు ఫిబ్రవరి 23 తేది నుండి 28 తేది వరకు స్వీకరిస్తారు. మార్చి 1 తేది పరిశీలిస్తారు. 4 తేది నామినేషన్ల ఉపసంహరణ అనంతరం తుది జాబితా ప్రకటిస్తారు. పోలింగ్ 19 వ తేదిన, కౌంటింగ్ 22 తేదిన జరుగుతాయి. వార్డులలో సభ్యుల నామినేషన్ల స్వీకరణకు 11 కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నారు. ఛైర్మన్ పదవికి నామినేషన్లు మాత్రం మునిసిపల్ ఆఫీసులోనే దాఖలు చేయాలి. నవాబుపేట బి.వి.ఎస్.ఎం. బాలికల వున్నత పాఠశాలలో 1, 2, 3, 4 వార్డులకు; స్టోన్‌హౌస్‌పేట తడికల బజారులోని ఆర్.ఎస్.ఆర్.ఎం. హైస్కూల్‌లో 5, 6, 7, 8 వార్డులకు నామినేషన్లు తీసుకొంటారు. 9, 10, 11, 12 వార్డులు ఎసినగర్ మునిసిపల్ హై స్కూల్. 13, 14, 15, 16 కరణాల మిట్ట మునిసిపల్ ఎలిమెంటరీ స్కూల్. 17, 18, 19, 20 వార్డులకు కస్తూరిబా కళాక్షేత్రంలో తీసుకుంటారు. 21, 22, 23, 24 పొదలకూరు రోడ్డులోని జడిపి హై స్కూల్. 25, 26, 27, 28 మూలపేట రామయ్య బడి. 29, 30, 31, 32 వార్డులకు బారకాసులోని మునిసిపల్ ఎలిమెంటరీ స్కూల్. 33, 34, 35, 36 వార్డులకు కోటమిట్ట మునిసిపల్ ఎలిమెంటరీ స్కూల్. 37, 38, 39, 40 ప్రభుత్వ మోడల్ హై స్కూల్. 41, 42, 43, 44 వార్డులకు రంగనాయకుల పేటలోని పి.ఎం.ఆర్.ఎం. స్కూల్‌లో స్వీకరిస్తారు. నామినేషన్లు స్వీకరించే అధికారులు ఉదయం 11 గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు సంబంధిత కేంద్రాలలో వుంటారని కమీషనర్ చెప్పారు.

కొరవ 8 పేజీలో


శుభాకాంక్షలు

శ్రీ ఆనం వివేకానంద రెడ్డి గారిచే
26.2.95 తేది ఉదయం ప్రారంభింప బడుచున్న

అలపాటి ఆయుర్వేద హాస్పిటల్
మరియు
రీసెర్చ్ సెంటర్
పడుగుపాడు - నెల్లూరు

ముఖ్య అతిథి : శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి

అయుర్వేద వైద్య రంగంలో నాడి సామ్రాట్
కీ.శే. అలపాటి వరదయ్య చౌదరి గారి
వారసునిగా డాక్టర్ అలపాటి రాజేంద్ర ప్రసాద్
అయన స్థాయికి ఎదగాలని కోరుకుంటూ మా హృదయ
పూర్వక శుభాకాంక్షలు తెలియ జేస్తున్నాము.

వర్ధని - రత్నమోహన్ - మాధవి - శ్రవణ్ దీప్


## సణుగుడు

### * మళ్లీ మామూలు దుబారా!

మండల, జిల్లా పరిషత్ ఎన్నికలలో మామూలు దుబారా ప్రత్యక్ష మౌతున్నది. ప్రచారార్భాటం యథా ప్రకారం సాక్షాత్కరిస్తున్నది. ఎన్నికల నిర్వహణలో శేషన్‌లేని లోటు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నది. నామినేషన్ల సమయంలోనే అభ్యర్థులు నానా హంగామా సృష్టించారు. కార్ల బార్లు, జెండాలు, బ్యానర్లు, మందు కొట్టి డైతక్కలాడే కార్యకర్తలు వగైరా వగైరాలన్నీ అక్షరం పొల్లు పోకుండా, తుచ తప్పకుండా కన్పిస్తున్నాయి.

నిండా రెండు నెలలు కాలేదు అసెంబ్లీ ఎన్నికలు జరిగి! ఇటు అధికారులకు, అటు అభ్యర్థులకు ఒక జీవిత కాలం గుర్తుండే విధంగా ఎన్నికల నిర్వహణ పాఠాలు నూరిపోశాడు శేషన్. వాటిని అందరూ అప్పుడే మర్చి పోవడం ఆశ్చర్యం. మర్చి పోయారనడం కంటే, మరపు కొని తెచ్చుకుంటు న్నారనడం సమంజసం. ఆ ఎన్నికలకు, ఈ ఎన్నికలకు కూడా ఒకే విధమైన నిబంధనలు, ఒకే రకమైన నియమాలు వున్నాయి. మండలానికి, జిల్లా స్థానానికి, పంచాయితీకి, వార్డుకి, మునిసిపల్ కౌన్సిలర్కు, ఛైర్మన్ గిరికి విడివిడిగా ఎన్నికల వ్యయం పరిమితి విధించారు. గీత దాటితే ఎన్నిక రద్దు అవుతుందని భయపెట్టారు. ఊరేగింపులు, సభలు, వాహనాల

### డోలేంద్ర

వాడకం, జెండాలు ఎగరేయడం బ్యానర్లు కట్టడం, పత్రికల్లో ప్రకటనలు చేయడం తదితర పద్దులన్నింటినీ విడివిడిగా వివరించారు. ఇవన్నీ వున్నాయి కాని, అసలు రౌతు మాత్రం లేడు. ఈ ఎన్నికలకు శేషన్‌తో ఏ మాత్రం సంబంధం లేక పోవడంతో అందరిలోనూ విచ్చలవిడి. అడిగే వారు లేరు, అడిగించుకునే వారూ లేరు. •

కొరవ 7 పేజీలో

# తక్కువ కాలంలో ఎక్కువ దిగుబడి నివ్వగల వరి రకాలే వేయండి!

ప్రస్తుతం మొలగొలుకుల పంట తర్వాత మొక్కదుగు పంటగా రెండో కారుకు 65,000 ఎకరాల్లో వరిని సాగుచేసేందుకు పంట కాల్వల ద్వారా నీరివ్వటం మన రైతాంగానికి విదితమే. ఈ సంవత్సరం ప్రతియేటా వలెగాక, ఈశాన్య రుతుపవనాల ద్వారాను, అటు తర్వాత కూడా వర్షాలు చాలా రోజులుగా హెచ్చు స్థాయిలో కురియటం వల్ల నారు మళ్లు దెబ్బతిని, రెండు మూడు పర్యాయాలు నార్లు పోసుకోవలసి వచ్చి, విత్తనాల కొరకు రైతాంగం ఇబ్బందులు పడ్డారు. ఈ నేపథ్యంలో 65,000 ఎకరాల్లో వరిసాగుకు నీరిస్తున్నందున్నదు వల్ల వరి విత్తనాల కొరకు రైతాంగం సమాయత్త మయ్యింది. రెండవ కారుకు మార్చినుండి జూన్ మాసం వరకు నీరందిస్తున్నందున ఈ పంటకాలంలో తక్కువ కాలపరిమితి గల వరి రకాలను (120 రోజుల లోపు) మాత్రమే సాగు చేయవలసిన అవసరం వుంది. మన జిల్లాలో ఈ రెండవ పంటకు (మొక్కదుగు) అనువైన వరి రకాలు, క్రింద వివరిస్తున్నాను.

ఎన్.ఎల్.ఆర్ - 30491, 33633, 33359, 33358; యం.టి.యు - 7014; ఐ.ఆర్-64; ఐ.ఇ.టి. -9994, 1444;

ఈ రకాలన్నీ నాలుగునెలల్లోనే కోతకు వస్తాయి. ఒక్క ఎన్.ఎల్.ఆర్-30491తప్ప మిగతా రకాలన్నింటినీ ఇప్పటి నుండే, అంటే ఫిబ్రవరి మాసం నుండి సాగు చేయవచ్చు. మంచు కాలంలో అగ్గి తెగులు తగులుతుంది కాబట్టి ఎన్.ఎల్.ఆర్ -30491 రకాన్ని ఫిబ్రవరి మాసంలో గాక, మార్చి నుండి నార్లు పోసుకుంటే అగ్గితెగులు బారినుండి తప్పించు కోవచ్చు. ఫిబ్రవరి - మార్చి మాసాల్లో నార్లుపోసే దానికన్నా ఏప్రెల్ నెలలో నార్లు పోస్తే హెచ్చు దిగుబడి వచ్చే అవకాశముంది. ఇక ఈ వరివంగడావివరాల గురించి తెలుసుకుందాం.

> రెండవ కారు
> రైతులకు
> వరి పరిశోధనా
> స్థానం సిఫార్సులు
> * * *
> డాక్టర్ పి. రాఘవరెడ్డి
> రైస్‌బ్రీడర్

### ఎన్.ఎల్.ఆర్-30491

నాలునెలల కాలపరిమితి (115-120రోజులు) గల ఈ రకం దిగుబడి 'రాశి' (ఐ.ఇ.టి1444) కన్నా హెచ్చుగా వుంది. రైతుల మన్ననలు పొందింది. దిగుబడి ఎకరానికి మూడు పుట్లు ఇవ్వగలదు. గింజనాణ్యత గల్గి, అన్నానికి బాగుంటుంది. గతంలో రైతులను భయభ్రాంతులను చేసిన టుంగ్రో వైరస్ వ్యాధిని తట్టుకుంటుంది. మంచు పడే కాలంలో అగ్గి తెగులు వస్తుంది గనుక ఈ రకాన్ని మంచు కాలమైన ఫిబ్రవరి మాసంలో నారు పోయకుండా, మార్చి నుండే సాగు చేయటం అనుకూలం. ఈ రకం ఎడగారు సాగుకు ఉత్తమమైనది.

### ఎన్.ఎల్.ఆర్-33633

ఈ రకం కూడా నాల్గు నెలల కాలపరిమితి గల్గి 'రాశి' కన్నా మంచి దిగుబడి నివ్వగలదు. దిగుబడి ఎకరానికి మూడు పుట్లవరకు నివ్వగలదు. గింజనాణ్యత గల్గి భోజనానికి అనువైనదవడం వల్ల మార్కెట్టులో మంచిధరతో అనతి కాలంలోనే రైతాంగం గుర్తింపు పొందింది. అగ్గి తెగులును తట్టుకొనగలదు.

### ఎన్.ఎల్.ఆర్-33359

ఈ రకం 115 రోజుల్లో కోతకు వస్తుంది. దిగుబడి స్థాయి ఎకరానికి మూడు పుట్లవరకు వుంటుంది. గింజ అతి నాణ్యంగా వుండి అగ్గితెగులును బాగుగా తట్టు కోగలదు. మంచి దిగుబడులతో చిత్తూరు నెల్లూరు జిల్లాల్లో త్వరితగతిని వ్యాప్తి చెందుతున్న రకం.

### ఎన్.ఎల్.ఆర్- 33358

గింజ పొడవుగా అతి నాణ్యత గల ఈ రకం పంటకాలం 105 రోజులు. దిగుబడికి ఎకరానికి 2 1/2 -3 పుట్ల వరకు ఇస్తుంది. అగ్గితెగులును బాగా తట్టుకొనగలదు. చౌడును తట్టుకోగల శక్తి వున్నందున

కొరవ 11 పేజీలో

# మునిసిపాలిటీలోనూ ముండమోయాలనా...

జిల్లా పరిషత్, మండలాల ఎన్నికల్లో రంజా కన్పరక పోవడంతో అందరి దృష్టి మునిసిపాలిటీల మీద పడుతున్నది. నెల్లూరు మునిసిపాలిటీ విషయంలో రెండు పార్టీల నాయకులూ చాలా ఆసక్తి ప్రదర్శిస్తున్నారు. జనరల్ స్థానం కావడం, ఓటర్లలో కన్పిస్తున్న మార్పు వల్ల పోటీ తీవ్రాతి తీవ్రంగా వుండ బోతుందన్న అభిప్రాయం ఏర్పడడంతో అందరి కళ్లు దీనిపైనే పడుతున్నాయి.

> నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్ పదవికి మాగుంట పంతం కాంగ్రెస్‌ను మళ్లీ కృంగదీస్తున్నది; కోవూరు, నెల్లూరు ఓటములు సైతం వారిలో మార్పు తేలేక పోవడం దురదృష్టకరం!

నామినేషన్ల ఘట్టం నిన్నటి (23 తేది) నుంచి ప్రారంభమైంది. కాని అప్పటి వరకు రెండు పార్టీల వారూ తమ అభ్యర్థులెవరో నిర్ణయించు కోలేక పోతున్నారు. ఛైర్మన్ అభ్యర్థి ఎవరో తెలవిదే, కౌన్సిలర్ల టిక్కెట్ల పంపకం తెగదు. అందువల్ల ఉభయ శిబిరాలలోనూ విపరీతమైన ఉత్కంఠ నెలకొని వుంది.

కాంగ్రెస్‌కు సంబంధించి ఆనం వివేకానంద రెడ్డి చాలా ఆశలో వున్నారు. ఆయనకు అర్హతలన్నీ వున్నాయి. టౌన్‌లో పలుకుబడి, కార్యకర్తల బలం వుండడమే కాదు - ఎప్పుడూ ఏ పదవీ పొందలేదన్న సానుభూతి వుంది. 1975లో, సంజయ్ గాంధీ ఉజ్వల దశలో వున్నప్పుడు నెల్లూరు ఉదయ భానుడుగా రాజకీయ రంగ ప్రవేశం చేశాడు వివేకానంద రెడ్డి. అప్పటి నుంచి ఇప్పటి వరకు, ఈ ఇరవయ్యేళ్లలో ఆయన నడిపినన్ని రాజకీయ పోరాటాలు ఇంకెవ్వరూ నడిపి వుండరు. అంతరించి పోతుందని, పోయిందని భావించని ఆనం కుటుంబ రాజకీయ అస్తిత్వాన్ని, ప్రాభవాన్ని కొన ప్రాణంలోనైనా నిల్పింది వివేకానంద రెడ్డి మాత్రమే. కాని ఆయనకు మాత్రం ఎప్పుడూ పదవీ అవకాశం రాలేదు. ఇప్పటి ఎన్నికలే తొలి అవకాశం.

మునిసిపాలిటీ జనరల్ కావడం, ఛైర్మన్ పదవికి కాంగ్రెస్‌లో పెద్దగా పోటీ లేక పోవడం, టౌన్‌లో అన్ని వార్డులలో అభ్యర్థులను నిల్పగల్గిన ఒకే ఒక నాయకుడిగా గుర్తింపబడడం వివేకాకు కలిసి వచ్చాయి. అన్నిటి కంటే పెద్ద అదృష్టం - మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డి మంచి మనసు చేసుకుని అభ్యర్థిత్వానికి సమ్మతి తెల్పడం. గత నాలుగైదేళ్లుగా తనను నమ్మకంగా అనుసరించి నందుకు బహుమానంగా జనార్దన రెడ్డి వివేకాకు ఛైర్మన్ టిక్కెట్ ఇప్పించేందుకు

## ముతాల కత్తులు నూరడం?

అంగీకరించారు. సాధారణంగా జనార్దన రెడ్డి గారు రాజకీయ కుటుంబాలకు ప్రోత్సాహం ఇవ్వరు. 1978 నుంచి ఆయన అదే ధోరణిలో వ్యవహరిస్తున్నారు. నెల్లూరు టౌన్‌లో వివేకా కంటే ముఖ్యులైన అనుచరులున్నారు ఆయనకు. అయినప్పటికీ కాంగ్రెస్ విజయావకాశాలు, వివేకానంద రెడ్డి ఉత్సాహం, విశ్వాస పాత్రత తదితరాలు పరిగణించి ఆయనీ నిర్ణయం తీసుకున్నారు.

ఇక్కడి వరకు పేచీ ఎదురు కాలేదు. ఈ దశలో ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి గారు రంగ ప్రవేశం చేశారు. ఎందువల్లనో జిల్లాలో మరే ఎన్నిక పట్ల కూడా సుబ్బరామ రెడ్డి గారు ఆసక్తి చూపలేదు. తన లోక్‌సభా నియోజక వర్గ పరిధిలోని మండల, జిపల విషయమూ పట్టించు కోలేదు. జిల్లాలో కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిని నిలబెట్ట లేకపోయిన ఒకే ఒక మండలం - కొండాపురం - ఆయన పరిధిలోనిదే! అక్కడెక్కడా లేని ఆసక్తి నెల్లూరు మునిసిపాలిటీ విషయంలో మాత్రం అమితంగా కల్గినట్లుం దాయనకు. మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో ఓడిపోయిన పివి ప్రసన్న రెడ్డికి టిక్కెట్ ఇప్పించడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నారు. స్థానిక సంస్థల ఎన్నికలన్నింటికీ స్థానికంగానే అభ్యర్థులను నిర్ణయించుకోమని పిసిసి ఆదేశించి వుంది. అయితే నెల్లూరులో తన అభీష్టం నెరవేర్చే వారెవ్వరూ లేక పోవడంతో ఆయన హైదరాబాదు వెళ్లి పిసిసికి తన అభ్యర్థన విన్పించారు. వారు పట్టించుకోలేదు దానితో పంతం పెరిగి ఢిల్లీకి వెళ్లారు. కేంద్ర నాయకులతో మాట్లాడి టిక్కెట్ తెస్తానని, అందువల్ల 44 వార్డులకు కౌన్సిల్ అభ్యర్థులతో రెడీగా వుండమని ఇక్కడి అనుచరులకు హుకుం చేశారట. నిజానికి ఈ పోటీ పట్ల ఆయన అనుచరులకు కూడా ఉత్సాహం లేదు. సాక్షాత్తు పివి ప్రసన్న రెడ్డి తన కిష్టం లేదని చెప్పారట. అయితే సుబ్బరామ రెడ్డి గారు అందుకు ఆగ్రహించి "పోటీ చేయడం చేయక పోవడం నీ ఇష్టం కాదు, మేము ఎట్లా చెప్తే అట్లా నడుకోవాలని" గద్దించాడట. వారి వ్యాపార సామ్రాజ్య నిర్వాహకుడిగా పాపమాయన వారి మాట కాదనలేరు కదా?

మునిసిపల్ ఛైర్మన్ టికెట్ కోసం ఢిల్లీకి వెళ్లవలసిన అవసరం ఏమిటన్నది ప్రశ్న. అంత పంతం దేనికి? పార్టీ క్లిష్ట సమయంలో వున్నప్పుడు సర్దుకొని పోయి ప్రవర్తించడం పెద్ద మనిషి తత్వం అవుతుంది తప్ప, వ్యక్తిగత మూర్ఖత్వంతో మరింత దెబ్బ తీయడం పొరపాటు; ఛైర్మన్ పదవిని ఆశించ వలసిన కెవిఆర్ చంద్రయ్య, దేవూరు దేవకుమార రెడ్డి వంటి కాంగ్రెస్ వాదులంతా గెలుపు ధ్యేయంగా భావించి సహకరిస్తున్నప్పుడు, సుబ్బరామ రెడ్డి గారు ముఠాల కత్తులను వెలికి తీయడం ప్రతి కాంగ్రెస్ వాదినీ కలత పెడుతున్నది.

సుబ్బరామ రెడ్డి గారు మొదటి నుంచి తనకు జనాకర్షణ ముందన్న

కరవ 7 పేజీలో

జిల్లా వార్తలు

# కొడుకు టిక్కెట్ కోసం టెలిఫోన్ల ట్యాపింగ్?

గూడూరు తెలుగుదేశం నాయకులు ఫోను చేయాలంటేనే హడలి చస్తున్నారు. దీనికి కారణం గూడూరు నాయకుల ఫోన్లు టాపింగ్ చేస్తుండడమే! మునిసిపల్ ఛైర్మన్ టిక్కెట్ కోసం పోటీలో వున్న పలువురిలో ఇక్కడి టెలిఫోన్ అధికారి

> గూడూరు టెలిఫోన్ అధికారి దుర్మార్గం - తెలుగు నాయకుల అగచాట్లు!

కుమారుడు కూడా వున్నాడు. ఈ అధికారి టిక్కెట్‌కోసం ముమ్మర ప్రయత్నాలు చేస్తూ జిల్లా నాయకుల నుండి ఇక్కడి నాయకులకు వచ్చే ఫోన్‌కాల్స్‌ను టాప్‌చేసి విషయాలు వింటున్నారు.

వాటి ఆధారంగా పలువురు నాయకులను తప్పుదారి పట్టించి తన కుమారుడి అభ్యర్థిత్వానికి మార్గం సుగమం చేస్తున్నట్లు వినికిడి. ఈ అధికారి సూళ్లూరుపేట శాసనసభ్యుడి బంధువు కూడా కావడంతో ఆయనకు పట్టపగ్గాలు లేకుండా వున్నట్లు తెలిసింది. ఆయన దెబ్బతో నాయకులు ఫోనెత్తాలంటేనే భయపడి, కేవలం అవతలివైపు ఎవరు మాట్లాడుతున్నారో తెలుసుకొని, స్వయంగా వెళ్లి రాజకీయాలు మాట్లాడి వస్తున్నారట. ఏది ఏమైనా ఈ అధికారి అధికార దుర్వినియోగానికి పాల్పడడం అన్యాయం. జిల్లా టెలికాం అధికారులు ఏంచేస్తున్నట్లు?

### ఒక తండ్రి ఆవేదన!

పిల్లల చదువు కోసం వేలాది రూపాయలు వెచ్చించినా, స్కూలు యాజమాన్యం నిరంకుశ ధోరణి వల్ల ఆయన పిల్లల భవిష్యత్తు ప్రశ్నార్థకమయ్యింది. కావలికి చెందిన ఎన్. భాస్కరరావు పిల్లలు సాయి కిషోర్, జయభారతిలు అక్కడి సెంట్‌యాన్స్ స్కూల్‌లో చదువు తుండేవారు. కొత్తగా పెట్టిన నలంద ఇంగ్లీష్ మీడియం ప్రైవేట్ స్కూల్‌లో సి.బి.యస్.ఇ సిలబస్ తో ఏడవ తరగతి ప్రారంభిస్తున్నట్లు ప్రకటించగానే, 91 లో అక్కడకు మార్పించారు. గుర్తింపు వస్తుందని రెండు సంవత్సరాలుగా యాజమాన్యం నమ్మబ[illegible]గుతూ మూడవ సంవత్సరంలో చేతులెత్తేసి రాష్ట్ర ప్రభుత్వ సిలబస్‌నే కొనసాగిస్తున్నట్లు చెప్పారట. సిలబస్ విషయంతోపాటు, పిల్లల చదువు గురించి తాను తరచూ

కరవ 7 పేజీలో

CROWN-TV
CT 8010 R
COSY 005-R
CT 2176 R
ఆథరైజ్డ్ సేల్స్ & సర్వీస్ డీలర్:
స్టీరియో సౌండ్స్ ట్రంక్‌రోడ్-నెల్లూరు
ఫోన్: 25428

స్త్రీల టానిక్ లోధ్ర
బాధారహిత ఆరోగ్యమును స్త్రీలకు 90 సంవత్సరములుగా ఇచ్చుచున్నది.
స్త్రీలకు కలుగు అకాల బహిష్టు, ముట్టుకుట్టు, బుతురక్తం ఎక్కువ తక్కువగాపోవుట, నడుము నొప్పి, సంతానహీనత, గర్భకాలపు జబ్బులకు
ఉచిత వైద్య సలహా కొరకై ఈ ప్రక్క చిరునామాతో సంప్రదించండి
తయారుచేయువారు:
కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-600 014.
ఏజంట్లు: సీతారామ జనరల్ స్టోర్సు ఏజన్సీస్, విజయవాడ - 1 - సికింద్రాబాద్

# నెల్లూరు ఎన్నికల్లో విశ్లేషకుడు

## కాంగ్రెస్ ఎంపిక సమావేశం 26 తేది

నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్ అభ్యర్థి ఎంపికకు డిసిసి నియమించిన సబ్ కమిటీ సమావేశం 26 తేది జరుగుతుంది. ఇందులో ఆనం సంజీవ రెడ్డి, పద్మశ్రీ, సిపి శేషారెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి, పిపి ప్రసన్న రెడ్డి సభ్యులు.

కమిటీ, గిమిటీ జాంతైనా, ఢిల్లీ నుంచి ప్రసన్నకు టికెట్ విమానంలో వచ్చి వాలుతుంది అంటున్నారు సుబ్బరామి రెడ్డి గారు.

## జనార్ధన రెడ్డి

షష్టిపూర్తి పెండ్లి కుమారుడు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 25 తేది ఉదయం మద్రాసు మీదుగా వారు చేరుతారు. సాయంత్రం 4 గంటలకు నెల్లూరు. 26 తేది ఉదయం నుంచి సాయంత్రం వరకు కూడా నెల్లూరు టౌన్‌లోనే వుంటారు.

## మంత్రి ప్రసన్న

చక్కెర మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి 21 తేది నెల్లూరు వచ్చారు. మండల టిక్కెట్ల పంపిణీ గొడవల్లో తిట్లుతిని, తిట్లు తలవాచి పోవడంతో విశ్రాంతి కోసం తిరుపతి వెళ్లాడు. రేపు కోటకు వచ్చి, ఆ చుట్టు ప్రక్కలే ఎన్నికల ప్రచారంలో తిరుగుతారు.

## జిప అభ్యర్థులు 235- మండలాలు తెలియదు!

జిల్లాలో నామినేషన్ల ఉపసంహరణల తర్వాత నికరంగా రంగంలో నిల్చిన అభ్యర్థుల సంఖ్య 235; నియోజక వర్గాల సంఖ్య 46. అంటే సరాసరిన ఐదేసి మంది ఒక్కొక్క స్థానానికి పోటీ పడుతున్నారన్న మాట. 46 మండలాలలోని 53 మండల నియోజక వర్గ స్థానాలకు ఎంత మంది పోటీలో వుండేది ఇంకా తెలియలేదు. జిల్లా అంతటి నుంచి సత్వరం సమాచారం సేకరించడంలో అధికారులు దారుణంగా విఫల మౌతున్నారు. ఎన్నికల నిర్వహణ అందరికీ కొత్తగానే వుంది. ఈ అయోమయ వైఖరితో ఎన్నికలు సక్రమంగా నిర్వహించ గలరా అన్న సందేహమూ కల్గుతున్నది.

పోలింగ్ రెండు రోజులలో - మార్చి 6, 10 తేదులు - జరుగుతుంది. 6 తేది సీతారామ పురం, ఉదయగిరి, వరికుంట పాడు, దుత్తలూరు, మర్రిపాడు, వింజమూరు, కలిగిరి, కొండాపురం, కావలి, జలదంకి, బోగోలు, కోవూరు, కొడవలూరు, విడవలూరు, దగదర్తి, అల్లూరు, బుచ్చి, సంగం, ఎఎస్ పేట, తోటపల్లి గూడూరు, నెల్లూరు రూరల్, ఇందుకూరు పేట, ఆత్మకూరులలో 6 పోలింగ్ జరుగుతుంది.

గూడూరు, సైదాపురం, మనుబోలు, చిల్లకూరు, వాకాడు, నాయుడుపేట, పెళ్లకూరు, సూళ్లూరు పేట, దొరవారి సత్రం, తడ, వెంకటగిరి, బాలాయపల్లి, డక్కిలి, రాపూరు, వెంకటాచలం, పొదలకూరు, చేజర్ల, కలువాయి లలో 10 తేది పోలింగ్ జరుగుతుంది.

జిప్రప అభ్యర్థులకు మండలంలోని ఓటర్లందరూ ఓటు చేయాలి; అది ప్రత్యక్ష ఎన్నిక క్రింద లెక్క. గెల్చిన ఈ 46 మంది జిప్రప అభ్యర్థులు జిల్లా పరిషత్ ఛైర్మన్‌ను ఎన్నుకొంటారు. మండలంలో వివిధ వార్డులకు ఎన్నిక జరుగుతుంది. గెల్చిన వారు మళ్లీ మండలాధ్యక్షుణ్ణి ఎన్నుకొంటారు. ఈ పద్ధతి ఇప్పటికీ ఓటర్లకు గందరగోళంగానే వున్నట్లుంది.

## మునిసిపల్ ఖర్చులు

మునిసిపాలిటీలో పోటీ చేసేవారు - వార్డు కౌన్సిలర్లయితే 8 వేలు లెక్కన, ఛైర్మన్ అభ్యర్థులు 50 వేల వరకు మాత్రమే ఖర్చు చేయాలి. నామినేషన్ల నాటి నుంచి ప్రతి పద్దునూ లెక్క వేస్తామని, అభ్యర్థులు గమనించాలని కమీషనర్ శ్రీ డివి రెడ్డి హెచ్చరిస్తున్నారు. మునిసిపాలిటీలకు నామినేషన్ల తుది గడవు 28 తేది; మార్చి 4 తేది వరకు ఉపసంహరణ లుంటాయి.

## నేదురుమల్లి షష్టి పూర్తి సాదాగా జరిగి పోయింది!

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి గారికి అరవై వసంతాలు నిండాయి. 20 తేది హైదరాబాదులోని తన 'జనప్రియ' గృహంలో నిరాడంబరంగా, కేవలం కుటుంబసభ్యుల సమక్షంలో షష్టిపూర్తి జరుపుకున్నారు. వేద పండితులు ఆశీర్వచనం పలికారు. అమెరికాలో వున్న రెండవ కుమారుడు తప్ప, తక్కిన సంతానం; బెంగుళూరు, నెల్లూరు, బొంబాయిలలో వున్న ఆయన సోదరీమణులు, ఇతర కుటుంబ ముఖ్యులు మాత్రం హాజరైనారు. జనార్ధన రెడ్డి గారికి వయస్సు 60 అయినా, మనసు ఎప్పుడూ 20 లలోనే వుంటుంది. కొత్త పెండ్లి కొడుకంత ఉత్సాహంగా, చలాకీగా దండలు మార్చుకొన్నారు దంపతులు.

ప్రధాన మంత్రి శ్రీ పివి నరసింహా రావు, జికె మూపనార్ వంటి కేంద్ర నాయకులు, టెలిఫోన్‌లో; రోశయ్య, దివాకర రెడ్డి, మైసూరా రెడ్డి, పి. జనార్ధన రెడ్డి, ఎఎస్ చౌదరి వంటి రాష్ట్ర నాయకులు పలువురు ఉన్నత ప్రభుత్వాధికారులు స్వయంగా శుభాకాంక్ష లందజేశారు.

జనార్ధన రెడ్డి గారి అరవై ఏళ్ల జీవితంలో వసంతాలెన్నో, గ్రీష్మ తాపాలూ అన్ని చవిచూశారు. సామాన్య, మధ్య తరగతి రైతు కుటుంబంలో జన్మించి, ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించి, రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఎదగడం వెనుక ఆయన సల్పిన జీవన పోరాటం అనుపమానమైనది. ఎదురు దెబ్బలు, వైఫల్యాలు, అవమానకర సంఘటనలు, ఆటు పోట్లు ఎన్ని [illegible] ఎదుర్కొని అంచె లంచెలుగా ఉన్నతికి వచ్చారాయన. విజయాలకు ఎప్పుడూ పొంగి పోలేదు, వైఫల్యాలకు కృంగి పోలేదు. రాజకీయ జీవితా రంభం నుంచి నేటి వరకు మనసా, వాచా కర్మణా కాంగ్రెస్ వాదిగానే వుండడం ఆయన విశిష్టత. ఆ పార్టీ కట్టుబాటే ఈ రోజు రాష్ట్రంలో కాంగ్రెస్‌కు పెద్ద దిక్కుగా ఆయనకు గుర్తింపు తెచ్చింది.

జనార్ధన రెడ్డి గారు సంపూర్ణ ఆరోగ్యంతో, ఇదే చలాకీతనంతో వేయి పున్నముల పండుగ చేసుకోవాలని జమీన్‌రైతు ఆకాంక్షిస్తున్నది.

మునిసిపాలిటీ
7 పేజీ కొరవ

భరించ గలరా? భరించి మౌనంగా వుండిపోతారా? లేక తిరగబడి స్వతంత్ర అభ్యర్థిగా నిలబడతారా? ఇవన్నీ శేష ప్రశ్నలు. నామినేషన్ల ఘట్టం పూర్తయితేనేకాని సమాధానాలు లభించవు. జిల్లాలో ఎటూ తుడిచి పెట్టుకొని పోయింది. మునిసిపాలిటీలో కూడా కాంగ్రెస్‌ను ముండమోయిస్తే చావుమేళానికి స్వస్తి పలక వచ్చునన్న ఉద్దేశ్యంతో ముఠాల కత్తులు నూరుతున్నారు నాయకులు.

* * *

తెలుగుదేశానికి సంబంధించి నెల్లూరు సీటుకు జరుగుతున్న పోటీ మాటల్లో వర్ణించలేము. హోరాహోరీ ముష్టాముష్టి యుద్ధాలు చేస్తున్నారు. ఛైర్మన్ ఎంపికలో తన మాట చెల్లించుకోవాలన్నది ఎమ్మెల్యే శ్రీ టి. రమేష్ రెడ్డి మంకు పట్టుదల. హఠం పట్టి హైదరాబాదులో తిష్ట వేసివున్నాడు. మిత్ర పక్షాలతో వార్డుల పంపకం విషయం టెలిఫోన్‌లో నైనా సంప్రదిస్తానుగాని తన వాడికి టిక్కెట్ వచ్చేంతవరకు నెల్లూరుకు రైలెక్కనని చెప్పేశాడు రమేష్‌రెడ్డి. ఆయన అభ్యర్థులు - స్వంత బావ వి. ఆనందరెడ్డి, ముఖ్య అనుచరుడు ఎం. శ్రీధర కృష్ణారెడ్డి. నాన్ రెడ్డిని ఎంపిక చేయమని ఎన్టీఆర్ సూచించినా వివేకానందరెడ్డితో పోటీ పడాలంటే అది అసాధ్యమని తేల్చి చెప్పాడట. అయితే వైటి నాయుడు రమేష్‌రెడ్డికి ధీటుగా ధుమ్మ్యాకాశాలు కదిలిస్తున్నాడు. అక్కినేని నాగేశ్వరరావు, ప్రధాన కార్యదర్శి రాజాజీ వంటివారి నుంచి సిఫార్సులు పొందాడు. చంద్ర బాబునాయుడును వదల కుండా పట్టుకొని వున్నాడు. టిక్కెట్ తనకు ఖాయమనే నమ్మకం వుంది వైటికి.

లక్ష్మీపార్వతి గారికి 30 లక్షల ముడుపు ఆఫర్‌తో రైస్ మిల్లర్ల సంఘం నాయకుడు కంచర్ల రవీంద్ర నాయుడు తన ప్రయత్నం తాను చేస్తున్నాడు. అతనికి [illegible] వెంకటేశ్వరరావు, [illegible] కృష్ణమనాయుడు; నెల్లూరు ఎమ్మెల్యేలు కొమ్మి లక్ష్మయ్య నాయుడు, దొమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిల మద్దతు వుంది. రవీంద్ర విషయంలో అతిగా జోక్యం చేసుకొంటున్నందుకు లక్ష్మయ్య నాయుడు రమేష్‌రెడ్డిచేత చీవాట్లు కూడా తిన్నాడు.

ఎన్టీఆర్ తుది నిర్ణయం 26తేది కాని వెలువడదని వినికిడి. అప్పటివరకు వీరందరిదీ పూగిసలాటే.

* * *

కావలిలో ఉభయ పార్టీల టిక్కెట్లలకూ పెద్ద పోటీ లేదు. గిరిజన మహిళకు రిజర్వు కావడంతో అభ్యర్థులే కరువై వున్నారక్కడ.

* * *

గూడూరులో తెలుగుదేశం టిక్కెట్ కోసం తన్నుకుంటున్నారు. హరిజన రిజర్వుడు స్థానం ఇది. మంత్రి ప్రసన్న, ఎమ్మెల్యే దుర్గా ప్రసాద్‌లలో ఎవరి మాట చెల్లుతుందో వేచి చూడాలి.

కాంగ్రెస్‌కు సంబంధించి జనార్ధనరెడ్డిదే ఫైనల్ నిర్ణయం.

పశువుల మందులు
అన్ని ప్రముఖ కంపెనీల పశువుల మందులు మా వద్ద లభించును
వివేకా మెడికల్స్
16/1295/3, పొగతోట
నెల్లూరు. ఫోన్: 27691

సరిక్రొత్త రుచులలో తయారు చేయబడుచున్న
విజయ తీపి వక్కపొడి -
స్పెషల్ వక్కపొడి
రుచి చూడండి! మళ్ళీ మళ్ళీ అదే కావాలంటారు.
విజయ వక్కపొడి
ట్రంకురోడ్డు, నెల్లూరు. ఫోన్: 23372

జంబో జెరాక్స్
3x10 అడుగుల వరకు
అతుకులు లేకుండా ఒకే షీట్‌గా
మరియు A5 నుండి A3 సైజు వరకు
ఎన్‌లార్జ్‌మెంట్, రిడక్షన్-మామూలు జెరాక్స్
హరీష్ ఇంజనీరింగ్ ప్లాన్ ప్రింటర్స్
16-1-324, స్వాతి కాంప్లెక్స్ (ఫస్ట్ ఫ్లోర్)
కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ ఎదురుగా,
ట్రంకురోడ్డు, నెల్లూరు. Ph: 24408, 22003

లేటెస్ట్ సూటింగ్స్, షర్టింగ్స్, జెంట్స్ రెడిమేడ్స్
విమల్ జంక్షన్
కాపువీధి ఫోన్: 25420 నెల్లూరు.
ప్రతి రూ. 200/- కొనుగోలు పై ఒక ఉచిత కూపన్ పొందండి, విలువైన బహుమతులు గెలుపొందండి.
మొదటి బహుమతి హీరోహోండా సిడి 100 మోటార్ సైకిల్
ద్వితీయ బహుమతి కెల్వినేటర్ ఫ్రిజ్ (165 లీటర్లు)
తృతీయ బహుమతి క్రౌన్ టి.వి. (51 సెం.మీ.) బ్లాక్ & వైట్
ఆథరైజ్‌డ్ డీలర్స్ RAYMOND'S Park Avenue

అమ్మబడును
ఇందుకూరుపేట మండలం మొత్తలు గ్రామములో మమారు 12 ఎకరములలో కాలువ, ఫిల్టర్ పాయింటు, బాట, 350 టెంకాయ చెట్లతో కలిగిన, చేపలు, రొయ్యలు గుంటలు అమ్మకమునకు కలవు.
వలయు వారు, వివరములకు
ఫోన్: 27188
ఎమ్. బాలశంకరరెడ్డి
3/172, లక్ష్మీపురం, పొగతోట, నెల్లూరు.

PHILIPS lifestylers
MIXIES
IRONS
JUICERS
Authorised Dealer:
PHILIPS
S.S. POINT
TRUNK ROAD, NELLORE
Ph: 23446

## సిద్దవటం డి.ము. కోర్టులో

O.S. No. 66 / 94

State Bank of India,
Vontimitta - Plaintiff

Vs

Mummadi Satyanarayana
S/o. Ranganayakulu,
Chinnakothapalli Village
Vontimitta Mandal,
Cuddapah District - Defendant

**NOTICE**

పై నంబరు దావా నందు వాదికి రావలసిన బాకీ రాబట్టు కొనుటకు గాను పై కోర్టులో దావా దాఖలు చేసియున్నారు. సదరు వాయిదా 1.3.95 వ తేదికి వున్నది. కావున తమకు పై దావా రోజున పై కోర్టునందు ఉదయం 10.30 గంటలకు హాజరై మీ అక్షేపణలు తెలుపు కోవలసినది లేని యెడల పరోక్షములో దావా తీర్మానించబడును.

G.S. Murthy
Advocate for Plaintiff
Station Road, Cuddapah

షష్టిపూర్తి వధూవరులు జనార్దన రెడ్డి, రాజ్యలక్ష్మి ఎంత యవ్వన శోభతో దండలు మార్చుకుంటున్నారో చూడండి; ప్రక్కన వారిద్దరికీ హారతి పడుతున్న కుటుంబ సభ్యులు

## సీట్లదగ్గరే

మొదటి పేజీ కొరవ

చంద్రమోహన్‌రెడ్డి తగువుకు వచ్చారు. మోహన్ చౌదరికి, ఆయనకు మధ్య పెద్ద రగడే జరిగింది. ఈ గొడవ పెద్దది కాకుండా తేగా ఇద్దర్నీ సర్దిబెట్టి, మోహన్ చౌదరికి నచ్చచెప్పి, ఎమ్మెల్యే ఇష్ట ప్రకారమే వేరొకరికి బీఫారం ఇచ్చారు. లేకుంటే తేగా ఇంటికి అంబులెన్స్‌లు పంపాల్సి వచ్చేది.

జిల్లా మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమారరెడ్డి టిక్కెట్ల విషయంలో అందరికంటే అధికంగా తిట్లు తిన్నారు. ఈ నాలుగు రోజులూ ఆయన ఇల్లు రణరంగమే. కావలి వేణుగోపాలరెడ్డి జలదంకి, కలిగిరి జీ.వ స్థానాల విషయంలో పేచీ వచ్చింది. ఉద్రిక్తత పెరిగింది. వేణు అనుచరులు మంత్రి ఇంటి ఎదుట ప్రదర్శన చేసి, తిట్టి పోశారు. కావలికె సంబంధించి, కెవంకె నాయుడు విషయంలో వీరిద్దరి మధ్య అల్లరి తప్పలేదు. నాయుడుపేట నుంచి వి. విజయ శేఖరరెడ్డి అనే యువకుడు పది పదిహేను కార్లనిండా జనాన్ని తోలుకొని వచ్చి, నెల్లూరులో మంత్రి ఇంటి ఎదుట ఆగం చేశాడు. పడుగుపాడు, కమ్మపాళెం మండల స్థానాలకు సంబంధించి కూడా పెద్ద గొడవ.

అన్నిటికంటె ఎక్కువగా మంత్రిని ఆందోళన పెట్టిన విషయం- తమ స్వగ్రామంగా భావింపబడుతూ వచ్చిన పూసుగుంట పాళెంలో తమ పెదనాన్న కుమారుడు నల్లపరెడ్డి జగన్‌మోహన్‌రెడ్డి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేయడం. ఆ గ్రామం చరిత్రలో అప్పటి వరకు పోటీ అన్నది లేదు. రాజీ యత్నాలు బెడిసి కొట్టడంతో చివరకు తన స్వంత తమ్ముడు జగదీష్ కుమార్ రెడ్డిని రంగంలోకి దించారు మంత్రి. అది వారి కుటుంబంలో పెద్ద అలజడి, అశాంతికి దారితీసింది. ఇద్దరూ పట్టువదల లేదు. రాజకీయాలలో అన్నతమ్ముడు, అక్కచెల్లెలనే వ్యత్యాసం లేదు కదా? కాంగ్రెస్ మాజీ మంత్రి, ప్రసన్న బావ జె.సి. దివాకరరెడ్డి టెలిఫోన్ సంధానం చేశారుకాని, ఫలించలేదు.

ఉదయగిరిలో కంభం విజయరామిరెడ్డికి, మొన్నటి ఎన్నికలలో కలిసి పనిచేసిన మాజీ ఎమ్పీ శ్రీ ఎం. రాజమోహన్‌రెడ్డి వర్గానికి సయోధ్య కుదరలేదు. చివరి వరకు చెరొక ప్రక్క చేరి త్రాడు లాగి, స్నేహాన్ని పుటుక్కున త్రెంచుకున్నారు.

ఆత్మకూరు ఎమ్మెల్యే శ్రీ కొమ్మి లక్ష్మయ్య నాయుడు తమ నియోజక వర్గంలోని తెలుగు దేశం కార్యకర్తలను అగ్గగ్గ లాడించేశారు. ఆయన ఆ పార్టీలో చేరి మూడు నెలలు కూడా కాలేదు. అదృష్టం వరించి ఎమ్మెల్యే అయిపోయాడు. అట్లని పది, పన్నెండేళ్ల నుంచి పార్టీని కనిపెట్టుకున్న వారిని సతాయిస్తే వూరకొంటారా? చేకూరు బాబూరావు వంటివారు గయ్‌మని లేచారు. కాని లక్ష్మయ్య నాయుడిది అమోఘమైన రాజకీయ బుర్ర. చాలా గ్రామాలలో తన పంతమే నెగ్గించు కున్నాడు.

రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి ఒకటి రెండు చోట్ల ఇదే పేచీలను ఎదుర్కొన్నారు. ఆయన అంకయ్య గౌడ్‌తో రాజీపడి పోవడంతో మొదటి నుంచి దేశంలో వున్న గ్రామనాయకులకు కష్టం కల్గింది. చాలా దగ్గర్ల గొడవలు జరిగాయి. అసంతృప్తులు, అలుకలు బయల్దేరాయి.

వెంకటగిరి లోనూ రచ్చలు. రావిళ్లె. బీఫారాలు పెట్టెలోనుంచి తీసి బయట పెట్టడానికి కూడా భయపడిపోయారు ఎమ్మెల్యే శ్రీ యాచేంద్ర. రాజప్రాసాదంలోని అంతఃపురంలో జనానికి కన్పడకుండా జనావామధ్య రాజుగా బ్రతకుతుండిన వాడు కాస్త రాజకీయాలతో రోడ్డుమీదకు వచ్చే సరికి అందరికి అలుసైపోయాడు పాపం.

* * *

కాంగ్రెస్‌కు సంబంధించి ఇటువంటి పేచీలు ఎక్కడో కాని విన్పడంలేదు. వారి సమస్య అంతా అభ్యర్థులవేట ! ఓటమి తప్పదనే నైరాశ్యంతో, భయంతో తమ నెక్కడ నిలబడమంటారోనని పలువురు మండలస్థాయి నాయకులు ఇళ్లలో దాక్కున్నారు. వారికి నచ్చచెప్పి, ధైర్యం చెప్పి, బుజ్జగించి, నామినేషన్లు వేయించేటప్పటికి మాజీ ఎమ్మెల్యేలకు తల ప్రాణం తోకకు వచ్చింది.

అదృష్ట వశాత్తు అసెంబ్లీ ఎన్నికలలో వలె కాంగ్రెస్ ముఠాల పోరు వీటి పై ప్రసరించలేదు. పూసుకుంటే ఎక్కడ బరువు, బాధ్యత తమపై పడతాయోనని ఎవరికి వారు తప్పించుకున్నారు. సర్వేపల్లి, రాపూరు, కోవూరు తదితరాలలో మొన్నటి ఎన్నికల సమయంలో మాగుంట, జెకె తదితరులు కాంగ్రెస్ అభ్యర్థుల ఓటమి కోసం ప్రతి గ్రామంలో జోక్యం చేసుకున్నారు. ఇప్పుడు ముఖం కూడా చూపించలేదు. ఆత్మకూరులో ఆనం సంజీవరెడ్డి గారు అదే పనిచేశారు. మొన్న ఓడిపోయిన ఎమ్మెల్యే అభ్యర్థులకు మాత్రం తప్పలేదు. క్రింద పడో, మీద పడో అందరూ అన్ని స్థానాలలో అభ్యర్థులను నిలబెట్టి కాంగ్రెస్ పరువు కాపాడారు.

కొన్ని చోట్ల కాంగ్రెస్‌కు గట్టి అభ్యర్థులే లభించారు. తోటపల్లి గూడూరులో అభ్యర్థే లేడని దిగులు పడివుండినాడు సివి శేషారెడ్డి. ఒకప్పటి జిల్లా రాజకీయాలలో పెద్దాయనగా గుర్తింపబడిన వేమారెడ్డి వెంకురెడ్డి మనుమడు శివకుమార్ రెడ్డి రంగంలోకి దిగాడు. తన చాతుర్యంతో మాగుంట, జెకెలను కూడా ఒప్పించి మరీ పోటీ చేస్తున్నాడీ యువకుడు. రాపూరులో పావకన్ను సోదరులను ప్రత్యక్షంగా రంగంలోకి దింపి తెలుగుదేశానికి వణుకు పుట్టించాడు ఆనం రామనారాయణరెడ్డి. కలువాయిలో కూడా స్వర్గీయ డాక్టర్ గోపాలరెడ్డి సతీమణిని ఒప్పించి ఆ సీటు ఖాయం చేసుకున్నాడు. వెంకటగిరి లోని మండలాల విషయంలో జనార్దనరెడ్డి దెబ్బకు రాజా చిత్తర పోతున్నారు. కాంగ్రెస్ అంటే ఓటమి గ్యారంటీ అన్న విశ్వాశాభిప్రాయం ఇటువంటి మండలాలలో సడలుతున్నది. ఇది ఒకరకంగా శుభ సూచకమేననాలి.

కాంగ్రెస్ వాదులందరూ ఇప్పటికైనా ఉత్సాహం తెచ్చుకొని గట్టిగా పనిచేస్తే ఓటమి తటస్థించినా మొన్నటంతటి పరాభవ స్థాయిలో వుండదన్పిస్తుంది.

## జిల్లా వార్తలు

5 పేజీ కొరవ

వాకబు చేస్తుండేవాడట. ఈ మూడు సంవత్సరాలలో పిల్లల ఫీజులు, పుస్తకాల కోసం 17 వేలకు పైగా ఖర్చు పెట్టారట. స్కూల్ యాజమాన్యం ప°వ తరగతి చదువు తున్న పిల్లలను అకస్మాత్తుగా అక్టోబర్ నెలలో స్కూల్ నుంచి పంపివేశారట. కారణమడిగితే సరిగా చదవడంలేదని కుంటి సాకు చెప్పారట. విద్యా సంవత్సరం మధ్యకాలం కావడంవల్ల పిల్లలను ఏ ఇతర స్కూల్‌లోనూ చేర్చుకోక, ప్రైవేట్‌గా పరీక్ష ఫీజు చెల్లించే సమయం మించిపోయి, తాను పడరాని పాట్లు పడినట్లు భాస్కరరావు ఆవేదన వ్యక్త పరిచారు. తరచూ ప్రోగ్రెస్ విచారించడం వల్ల కరస్పాండెంట్ కక్ష సాధింపుగా ఈ పనికి పాల్పడ్డాడని, పిల్లలు చదువు రానివారైతే రెండు సంవత్సరాలకు పైగా వుంచుకొని వేలాది రూపాయల ఫీజు ఎందుకు వసూలు చేశారని ఈతండ్రి ప్రశ్నిస్తున్నారు. తన పిల్లలకు జరిగిన అన్యాయం మరొకరికి జరగకుండా యాజమాన్యంపై వినియోగదారుల ఫోరంలో ఫిర్యాదు చేస్తున్నట్లు చెప్పాడాయన.

## సణుగుడు

4 పేజీ కొరవ

ఖర్చు పెట్టవలసి రావడం అభ్యర్థులకు సంతోష పడవలసిన విషయం కాదు. డబ్బు దుబారా చేయాలని ఎవరూ అనుకోరు. కాని అధికారులు సందిస్తే తమకు తెలియకుండానే, తమ కిష్టం లేకుండానే డబ్బు వెదజల్ల వలసి వస్తుంది వారికి. గ్రామాల నుంచి వచ్చే కార్యకర్తలు జెండాలు, కార్లు కావాలని ప్రాణం తోడేస్తారు. ఒకరు కడితే రెండవ వారికి తప్పదు. ఇక అప్పటి నుంచి పోటా పోటీలు. ద్రవ్యం ద్రవం వలె ప్రవహిస్తుంది.

సాంబశివ రావు గారు కలెక్టర్‌గా కంటిన్యూ అయి వుంటె నామినేషన్ల స్థాయి నుంచి అభ్యర్థుల లోక కత్తిరించి వుండేవారు. క్రమశిక్షణ దానంతట అదే నెలకొని వుండేది. కాని

ప్రేమ్‌చంద్ గారు జిల్లాకు, ఎన్నికలకు కూడా కొత్త. అందువల్ల అంతగా జోక్యం చేసుకోలేక పోతున్నారు. దానితో అభ్యర్థుల హంగామా ప్రదర్శనలు ప్రారంభించేశారు. ఇప్పటికైనా మించి పోయిందేమీ లేదు. కలెక్టర్ గారు ఎన్నికల నియమావళిని ఖచ్చితంగా అమలు జరపాలని రాజకీయ పార్టీల సన్నింటిని పిల్చి హెచ్చరిస్తే ఎన్నికలు ఎన్నికల వలె జరుగుతాయి. అభ్యర్థులు బ్రతికి బయట పడతారు.

## మునిసిపాలిటీ

5 పేజీ కొరవ

నమ్మకంలో వుంటుంటారు. నెల్లూరు జిల్లా ప్రజానీకం తాను గీసిన గీత దాటరన్న అభిప్రాయం వుంది ఆయనలో! కోట్లకు పడగలెత్తిన వారు కాబట్టి, ఆ సంపద పై మక్కువతో ప్రక్కన చేరిన వారు ఆ అభిప్రాయాలను మరింత ఉద్దీపింప జేస్తుంటారు. కోవూరు, నెల్లూరు శాసన సభ ఎన్నికలలో ఓటర్లు తన పట్ల అంత స్పష్టమైన తీర్పు ఇచ్చి, ఓటమి రుచి చూపించి నప్పటికీ ఆయనలో పరివర్తన కల్గక పోవడం విచారకరం.

ఆయన పివి ప్రసన్నకు ఢిల్లీనుంచి టిక్కెట్ తెచ్చుకుంటే ఇక్కడ పెల్లుబుకె అసంతృప్తి, ఆగ్రహ జ్వాలలను తట్టుకొని ఎన్నికలో నిలబడగలరా? అందరి తోడ్పాటు తీసుకోగలరా? పంతం, పట్టుదల ఇంత దూరం పోయిన తర్వాత టిక్కెట్ రాకుంటె ఆ అవమానం

కొరవ 6 పేజీలో


## ప్రకటన

ఇందు మూలముగా యావన్మందికి తెలియ చేయడమేమనగా ఇటీవల మా అన్నగారైన శ్రీ గువ్వల సదాశివ రెడ్డి ఈ క్రింది షెడ్యూల్ దాఖలా ఆస్తిని మొత్తం అమ్ముటకు ప్రయత్నం చేయుచున్నారని నాకు తెలియ వచ్చింది కావున ఈ ప్రకటన ద్వారా తెలియ చేస్తున్నాను.

మా తల్లిగారు శ్రీమతి గువ్వల రత్నమ్మ గారి రిజిష్టర్ విల్లు నం. 30 52/72 ద్వారా మరియు నెల్లూరు సబార్డినేట్ జడ్జి కోర్టు వారు పాస్ చేసిన O.S. No. 43 of 1976 కాంప్రమైజ డిక్రీ ద్వారాను క్రింది షెడ్యూలు ఆస్తి నాకున్నూ నా అన్న సదాశివ రెడ్డికిన్నూ సమాన భాగములుగా సంక్రమించినవి. కావున సదరు ఆస్తిని నా ఎరుక లేకుండా ఎవ్వరైనా కొనుగోలు చేసినా అట్టి కొనుగోలు చెల్లదు సదరు ఆస్తిలో నా భాగమునకు నేను, నా వారసులు మాత్రమే హక్కుదారులము. కనుక గమనించగలరు.

### ఆస్తి షెడ్యూల్

నెల్లూరు పోకూరి వారి వీధిలోని నం. 13/411 డోరు నంబరు గల మిద్దె ఇల్లు. అసెస్‌మెంటు నం. 11623 హద్దులు: తూర్పు: ఆనం వెంకట కృష్ణారెడ్డి, ఉత్తరం: మడి (కూరగాయల వ్యాపారం), పడమర: సందు, దక్షిణం: సందు. హద్దులలో గల మిద్దె ఇల్లు.

నెల్లూరు గువ్వల దయాకర్‌రెడ్డి,
M.A., M.Ped
22.2.95 24/355, రాజాగారి వీధి,
మూలాపేట, నెల్లూరు



**వరివిత్తనములు**

| | పంటకాలం |
|---|---|
| NLR 33633 | 120 రోజులు |
| NLR 30491 | 120 రోజులు |

పై విత్తనము మా వద్ద వున్నది.
కావలసిన వారు
పి.డి. రామిరెడ్డి
కసుమర్తిపాడు గ్రామం
నెల్లూరు - 524 004.
31 నం. బస్సు సౌకర్యం కలదు



పెనుబల్లి శ్రీనివాసులు కుమారుడు చక్రధర్ బి.టెక్. విజయలక్ష్మి వీరి వివాహం ఇటీవల ఒంగోలులో జరిగింది.

## నెల్లూరు సంగతులు

4 పేజీ కారవ

### మానవుల్లో అశాంతి స్వార్థం పెరిగిపోయింది

ప్రపంచంలో అశాంతి, స్వార్థం పెరిగి పోయిందని, స్వధర్మాన్ని పాడు చేస్తున్నారని మైసూరు దత్త పీఠాధిపతి గణపతి సచ్చిదానంద స్వామి చెప్పారు. 19 తేది కొండాయ పాలెం గేటు వద్ద గల కృష్ణ మందిరంలో విలేఖరులతో మాట్లాడారాయన. మనిషిలో మానవత్వపు విలువలు తగ్గిపోయాయని, తనకు రెండు కళ్లు పోయినా ఫరవాలేదు; ఎదుటి వానికి ఒక కన్ను పోవాలనే మనస్తత్వం పెరిగి పోయిందన్నారు. తత్వం పాటించే వారు కరువయ్యారు. మానవులు త్యాగ బుద్ధితో తత్వ పూజ పాటించాలని స్వామీజీ కోరారు. కర్తవ్యమే నిజమైన పూజగా అభివర్ణించారాయన. విశ్వశాంతి కోసం శాంతి బ్రహ్మ డాక్యుమెంటరీ రూపొందిస్తున్నట్లు చెబుతూ ఇప్పటి వరకు తమ ఆశ్రమం యోగ సూత్రాల పై తీసిన యోగ బ్రహ్మ, సంగీతం పై నాద బ్రహ్మ డాక్యుమెంటరీలు ప్రజాదరణ పొందినట్లు చెప్పారు.

నెల్లూరులో 17 లక్షల వ్యయంతో నిర్మిస్తున్న నాద మండపానికి తాను శంకుస్థాపన చేసినట్లు చెప్పారు. అమెరికాలో ఆరులక్షల మంది దత్త భక్తులున్నారని పిట్స్‌బర్గ్, మిసిసిపిలలో సచ్చిదానంద ఆశ్రమాన్ని, వెస్టిండీస్‌లో అనాథ బాలలు, వితంతువుల కోసం ప్రత్యేక హాస్టల్లు పెట్టినట్లు వివరించారాయన.

### 90 రోజుల్లో విడిఓల భవనం రెడీ!

నెల్లూరు జిల్లా గ్రామీణాభివృద్ధి అధికారుల సంఘం (విడిఓ) భవనాన్ని 90 రోజుల్లో పూర్తి చేయాలని సంఘం శంకుస్థాపన రోజే తీర్మానించింది. 20 తేది కొండాయపాలెం గేటు దగ్గర జిల్లా సైనిక్ భవన్ పక్కనే వుండే స్థలంలో భవన నిర్మాణానికి సంఘం జిల్లా అధ్యక్షుడు ఆర్. రుస్తుం సింగ్ శంకుస్థాపన చేసారు. కార్యక్రమంలో ఎన్.జి.ఓ.ల సంఘం మాజీ అధ్యక్షుడు పి.హెచ్. జయదేవదానం, ప్రస్తుత అధ్యక్షుడు దేవళ్ల దశరథ రామిరెడ్డి, వై. దుర్గా ప్రసాద్, కార్యదర్శి వి. నాగరాజ తదితరులు పాల్గొన్నారు. విడిఓలు తలచుకోవాలే గాని రెండు నెలల్లోనే [illegible]

### రిటైర్డ్ టీచర్ల సంఘ సమావేశం

జిల్లా రిటైర్డ్ టీచర్ అసోసియేషన్ జిల్లా సంఘ సర్వసభ్య సమావేశం అధ్యక్షుడు కె. సంపత్ కుమార్ అధ్యక్షతన ఇటీవల జరిగింది. మాజీ ఎమ్మెల్యే కె.వి. సుబ్బారెడ్డి, చెన్నూరు కృష్ణమూర్తి, డి. కోటయ్య, తదితరులు పాల్గొన్నారు. 370 రూపాయలు పెన్షన్ పొందుతున్న వారికి కరువు బత్తెం ఇవ్వాలని; తమిళనాడు రాష్ట్ర పెన్షనీర్లకు ఇచ్చే విధంగా మెడికల్ అలవెన్సులు ఇవ్వాలని; రైలు, బస్సు ప్రయాణాలలో అర్థ ఛార్జీతో ప్రయాణించే సౌకర్యం కల్పించాలని తీర్మానించారు.

### మహారుద్రాభిషేకం

కల్కి భగవాన్ ఆలయ నిర్వహణలో 27 తేది టౌన్‌హాల్‌లో మహారుద్రాభిషేకం జరుగుతుంది. ప్రముఖ వేద పండితులు పాల్గొనే ఈ కార్యక్రమంలో అధ్యాత్మిక చింతన గలవారు పాల్గొనాలని ఆలయం ధర్మ గురువులు చివుకుల మాలకొండయ్య, సహన తెలియజేస్తున్నారు.

### ఉత్తమనటిగా మాధవి

ఫిబ్రవరి 10 నుండి 12 వరకు విజయవాడలో జరిగిన కె.ఎస్. మూర్తి మెమోరియల్ రాష్ట్ర స్థాయి నాటికల పోటీల్లో నెల్లూరీయులు రెండు బహుమతులు పొందారు. సిద్ధార్థ ఆర్ట్స్ అకాడమి ఐవ్. నవనాథ రావు



దర్శకత్వం వహించిన వలయం నాటికకు రెండు బహుమతులు లభించాయి. వర్ధమాన నటి కుమారి మాధవి ఉత్తమ నటి అవార్డును కె. రాజగోపాల్ ప్రత్యేక ప్రశంసా బహుమతి పొందారు. మాధవి గతవారం గిద్దలూరు గోపాల రావు [illegible] ప్రసారమైన కవి బ్రహ్మ తిక్కన నాటకంలోను, పలు రేడియో నాటకాల్లోను కథానాయిక పాత్ర పోషించింది. ప్రతిభ వున్న ఈ యువనటి భవిష్యత్తులో మరిన్ని అవార్డులు పొందాలని ఆశిద్దాం.

### జడ్పీకాలనీ అభివృద్ధికి కమీషనర్ హామీ!

టౌన్‌లోని జడ్పీ కాలనీలోని సమస్యలను మునిసిపల్ ఎన్నికలయ్యాక ఒకదాని తరువాత మరొకటిగా పరిష్కరిస్తామని మునిసిపల్ కమీషనర్ కెప్టెన్ డి.వి. రెడ్డి హామి ఇచ్చారు. జిల్లా పరిషత్ కాలనీ వెల్ఫేర్ అసోసియేషన్ 20 తేది ఏర్పాటు చేసిన ఉచిత వైద్య శిబిరంలో జాయింట్ కలెక్టర్ ఎం. ఆర్. నాయిక్ కూడా పాల్గొన్నారు. కమీషనర్ మాట్లాడుతూ కాలనీలో అసౌకర్యాలు చూసిన అప్పటి ఎమ్మెల్యే జెకె రెడ్డి తన కోటా నుంచి పది లక్షలు ఇస్తానని చెప్పి ఇవ్వలేక పోయినట్లు చెప్పారు. అయినా కొన్ని పనుల కోసం మునిసిపాలిటీ ఐదు లక్షల రూపాయలకు పైగా మంజూరు చేసినట్లు చెప్పారు. ఇంటి పన్నులు ఖచ్చితంగా కడుతున్న కాలనీ వాసులకు కొంత సౌకర్యం కల్గించడం తమ బాధ్యతేనని అంగీకరిస్తూ నిదానంగా పనులు చేస్తామన్నారాయన. కార్యక్రమంలో అసోసియేషన్ అధ్యక్షుడు పెంచలయ్య కూడా పాల్గొన్నారు.

### ప్రైవేట్ విద్యాసంస్థల కరస్పాండెంట్ల సమావేశం!

15 తేది బారకాసులోని సర్వోదయా కాన్వెంటులో వొమ్మిన సుబ్రహ్మణ్యం అధ్యక్షతన నెల్లూరు జిల్లా ప్రైవేట్ విద్యా సంస్థల అసోసియేషన్ కరస్పాండెంట్ల సమావేశం జరిగింది. ప్రతి వున్నత పాఠశాల విద్యార్థి పైనా ప్రభుత్వం నెలకు 550 రూపాయలు ఖర్చు చేసినా సాధించలేని ఫలితాలు, ప్రైవేటు విద్యాసంస్థలు 100 రూపాయల ఫీజు వసూలు చేస్తూ సమర్థవంతమైన ఫలితాలు సాధిస్తున్నా యన్నారు. 10 సంవత్సరాలు స్కూలు నడిపిన వారికి శాశ్వత గుర్తింపు ఇవ్వాలని, ప్రభుత్వానికి కట్టివున్న ఎండోమెంటు తిరిగి వాపసు ఇవ్వాలని, కష్టతరంగా వున్న చట్టాలు సవరించాలని సంఘ రాష్ట్ర సంఘం ప్రధాన కార్యదర్శి ఎన్. అంజయ్య చెప్పారు. సమావేశంలో స్వామిదాసు, శ్రీహరి నారాయణ రెడ్డి, కేశవ రావు తదితరులు పాల్గొన్నారు.

### షేర్లు

2 పేజీ కారవ

సబ్‌స్క్రయిబ్ అయ్యేవి. కాని షేర్ మార్కెట్ పతనపు ప్రభావం వల్ల గతవారం రోజులనుంచి పబ్లిక్ ఇష్యూలు దెబ్బ తింటున్నాయి. కొన్ని కొత్త కంపెనీల ప్రమోటర్లు బింకంగా ఎర్లియస్ట్ ముగింపు ప్రకటించి, దొడ్డిదారిన తామే వడ్డీలకు తెచ్చిన ధనంతో తమ షేర్లను తామే కొంటున్నారు. కొత్త కంపెనీల షేర్లు చాలా వరకు లిస్ట్ కావడం లేదు.

-డాక్టర్ డిపి.

## శివారెడ్డి పద్యాలు

### ఆరుకోట్ల అభిమాని ఎన్.టి.ఆర్.

కత్తిగట్టినావుకాంగ్రెసుపార్టీపై
ఎన్‌టి రామారావు ఇంతకంటె
చెడ్డవేరలేదుచెడిపోర్టిజైఆంధ్ర
మూడుముక్కలొద్దిమొదటికిమోసం!

ఎంతటోడుగూడ ఎగిరిగంతేస్తాడు
పడుగులెత్తుతారుపడుతులెన్సు
ఎందుకిదురాక ఏనాడుబుట్టిందో
కాంగ్రెసుపోదుకల్లగాదు!

అడిగినోడికెల్లఅధికారమిచ్చావు
కోరినోడికెల్లకోట్లుకోట్లు
ఫణమొత్తుణమొఇచ్చివంచిపెట్టినావు
సహజకవిని నన్ను సత్కరిపు.

కాంగ్రెసుపోతె కాలప్రవాహంలో
కలసిపోతెఅట్టెకన్నుమూస్త
ఆంధ్రరాష్ట్ర మునకుఅవసానకాలమ్ము
దగ్గరొద్దిలేదుదారితెన్ను.

పదులు,నూర్లు,వేలుపద్యాలురచియించి
నీదునీతినిష్టనెమరువేస్త
పద్దినాల్లనిన్నుప్రైమినిస్టు జేస్త
ఆంధ్రముఖ్యమంత్రినౌతానేను.

"

## జనవాణి

3 పేజీ కారవ

రిజర్వేషన్ల విధానం ప్రకటించగానే ఇంత కాలం పదవులు అనుభవిస్తున్న వారికి ఒక్కసారిగా బాధ కల్గింది. స్థానిక పరిపాలనా పదవులకు మెజార్టీ స్థానాల్లో అగ్రవర్ణాల వారే పెత్తనం చెలాయించేవారు. ప్రస్తుతం పదవుల రిజర్వేషన్ల పై ఈ నాయకులు వ్యాఖ్యానిస్తూ పరిపాలన చేయడం వీరివల్ల అవుతుందా అని పెదవులు విరుస్తున్నారు. ఈ విధానం రెండు, మూడు సార్లు కొనసాగితే అందరూ బహుజను లవుతారు. అందువల్ల పోటీలు లేకుండా ఏకాభిప్రాయ సాధన ద్వారా ఈ ఎన్నికల్లో నాయకులను ఎన్నుకొంటే బాగుంటుంది.

గూడూరు -ఎన్.వి. రమణయ్య

### రైళ్లలో జనరల్ బోగీలు పెంచాలి!

రైలు ప్రయాణీకుల సంఖ్య రోజు రోజుకి పెరుగుతోంది. ప్రజల అవసరాలకు అనుగుణంగా అదనపు రైళ్లు వేయను రైల్వేశాఖకు ఎప్పుడూ అశక్తతే. కనీసం నడుస్తున్న రైళ్లలో బోగీల సంఖ్య కూడా పెంచడం లేదు. చాలా ముందుగా రిజర్వేషన్ లేకపోతే ప్రయాణం చేయడం నరకమే. రైలు మొదట్లో ఒకటి, చివర్లో ఒకటి జనరల్ బోగీలు; పెట్టి చేతులు దులుపు కొంటారు. అవి కూడా పాత బోగీలు నిలబడటానికి కూడా చోటు లేనంత క్రిక్కిరిసి వుంటాయి. ఆకస్మికంగా ప్రయాణం చేయాల్సి వస్తే వృద్ధులు, స్త్రీలు, పిల్లలు, శారీరక వికలాంగులు ఎన్ని అవస్థలు పడాలో చెప్పను మాటలు చాలవు. తరచు ఛార్జీలు పెంచడం కాదు. ప్రయాణీకుల సౌకర్యం విషయమై కూడా ఆలోచించాలి.

కావలి -షేక్ ఫయాజ్

### బాలాజీనగర్ పోస్టుమాస్టర్ తీరు!

నెల్లూరు బాలాజీనగర్ పోస్టుమాస్టర్ కొత్తరకం హుకుం జారీ చేస్తున్నారు. దాని ప్రకారం ఏ ప్రాంతంలో వుండే వారు వారి సమీప పోస్టాఫీసుల ద్వారానే రిజిష్టర్ పోస్టులుపంపాలట. ఆ విధంగా వుత్తర్వులు వున్నాయంటున్నారు. మరి ఈ విధంగా చేయడం నిజంగా సాధ్యమవుతుందా? విపిలు సరే, రిజిష్టరు పోస్టు కూడా ఆ విధంగా పంపాలంటే వినియోగ దారులు ఎన్ని అవస్థలు పడాలో ఒకసారి అధికారులు ఆలోచిస్తే మంచిది.

నెల్లూరు --కె.వి. సత్యనారాయణ

### ప్రజాపంపిణీ వ్యవస్థను మార్చండి!

జిల్లాలో అమలులో వున్న ప్రజా పంపిణీ వ్యవస్థ వల్ల ప్రజలు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వుద్యోగులు, సామాన్య ప్రజలు, గృహిణులు రేషన్ కోసం గంటల తరబడి క్యూలో నిలబడి సరకులు పొంద వలసిన స్థితి. ఈ విధంగా కాకుండా చక్కెర, బియ్యం ఒకపూట; కిరోసిన్ మరోపూట ఇస్తే బాగుంటుంది. రేషన్ షాపులు పెంచితే ప్రజలు, ఇబ్బంది లేకుండా సరకులు తెచ్చుకొంటారు. ముఖ్యంగా కిరోసిన్ ధర బ్లాక్ మార్కెట్‌లో ఆకాశాన్ని అంటుతున్నది. గ్యాస్ సౌకర్యం లేని వుద్యోగులకు గ్రామాల్లో పట్టణాల్లో కిరోసిన్ కోటా ఎక్కువగా ఇవ్వాలి.

సంగం -పోట్ల శ్రీహరి

### పంచాంగం

#### పండుగలు

27తేది సోమవారం మహా శివరాత్రి

#### ఫిబ్రవరి తిథులు

మాఘ బహుళ

తే 25 శని ఏకాదశి రా.గం. 11.04వ
తే 26 ఆది ద్వాదశి రా.గం. 9.10వ
తే 27 సోమ త్రయోదశి రా.గం. 7.29వ
తే 28 మంగళ చతుర్దశి సా.గం 6.12వ

#### మార్చి తిథులు

తే 1 బుధ అమావాస్య సా.గం. 5.25వ

ఫాల్గుణ శుద్ధ

తే 2 గురు పాడ్యమి సా.గం. 5.00వ
తే 3 శుక్ర విదియ సా.గం. 5.12వ

స్వయంపాకుల శ్రీనివాసులు., యం.ఏ.

## సినిమా సినిమా సినిమా

### కుప్పిగంతులు ఇక వేయను: బాబూమోహన్

"నిజమే అన్నా! ఒకప్పుడు డబ్బుకోసం వచ్చిన ప్రతి చిత్రాన్నీ ఒప్పుకున్నాను. ప్రజల్లో కాస్త గుర్తింపు పొందిన తర్వాత చెత్త హాస్య పాత్రలను ఎందుకు చేయాలి? అందుకే విరుడు నేను ఎక్కువ చిత్రాలు చేయలేదు. రేలంగి, రాజబాబు గార్లలా మంచి పేరు తెచ్చుకోవాలనుంది. కుప్పిగంతులు మానేసి ఇటువైన అందర్నీ కడుపుబ్బ నవ్వించే డీసెంట్ క్యారెక్టర్‌లనే వేయాలనే నిర్ణయాని కొచ్చాను," అన్నాడు బాబూమోహన్. అంటే, ఈ సంవత్సరమూ చాలా తక్కువ చిత్రాలలో చేస్తాడేమో మరి.

### తెలుగు నిర్మాతల తమిళ చిత్రాలు

ఎ.ఎం. రత్నం, వడ్డే రమేష్, కాట్రగడ్డ ప్రసాద్, సుధాకరరాజా, కె.సి. శేఖర్‌బాబు ప్రభృతులు తమిళ చిత్రం రంగంలో ప్రవేశించారు. తెలుగు చిత్ర పరిశ్రమలో నిర్మాణ వ్యయం విపరీతంగా పెరిగి పోయింది. నిర్మాతలు అడిగే ఎక్కువ రేట్లకు బయ్యర్లు కొనుక్కునే స్థితిలో లేరు. అందుకే వారు తమిళ సినిమా రంగంలో ప్రవేశించారు.

### విజయవారి "అర్జున విజయం"

బాలకృష్ణ హీరోగా సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో తయారయ్యే "అర్జునవిజయం" పౌరాణికం ఏప్రెల్‌లో ప్రారంభ మౌతుందని నిర్మాత బి. వెంకట్రామ రెడ్డి తెలిపారు.

ఇది వీరి "భైరవద్వీపం" చిత్రాన్ని మించి పోతుందని అంటున్నారు.

### కమల్ తొలి చిత్రం

తమిళంలో మాత్రమే చిత్రాలు నిర్మిస్తూ వచ్చిన కమలహాసన్ సొంత సంస్థ రాజ్‌కమల్ పిక్చర్స్ పతాకంలో తొలిసారిగా తెలుగులో ఒక చిత్రాన్ని నిర్మించడానికి నిశ్చయించారు. దర్శకత్వం బాధ్యతను ఛాయగ్రాహకుడు పి.సి. శ్రీరామ్‌కు అప్పగించారు.

### రజనీకాంత్ నటించే రెండు తెలుగు చిత్రాలు

మోహన్‌బాబు రెండు తమిళ చిత్రాల హక్కులను కొన్నాడు. తమిళం "నాట్టామై" లో విజయ కుమార్ ధరించిన పాత్రను "పెదరాయుడు"లో రజనీకాంత్ ధరిస్తున్నాడు. మరొకటి "బాద్షా" చిత్రంలో చరణ్‌రాజ్ ధరించిన వేషం.

### తెలుగులో నటించను టైం లేదు: రేవతి

రేవతిని ఇటీవల ఒక తెలుగు నిర్మాత తన చిత్రంలో నటించమని అడిగితే "క్షమించాలి" అన్నదట. కారణమడిగితే నా భర్త, తల్లిదండ్రులు, స్నేహితులతో గడపడానికి టైమ్ ఉండడంలేదు. కులాసాగా గడపవలసిన సమయాన్ని సినిమాకోసం కేటాయించడం నాకిష్టంలేదు; అందుకే ఏటా ఒక తమిళ చిత్రాన్ని మాత్రం చేయానికి నిశ్చయించాను. ఇక తెలుగు చిత్రానికి టైమేది? అందామె. మంచి నిర్ణయమే.

### 'బొంబాయి'కి విమోచనం ఎప్పుడు?

బొంబాయి పేలుళ్ళ నేపథ్యంలో తయారైన చిత్రం చివరికి రివైజింగ్ కమిటీకి పంపబడింది. వాళ్ళు ఒకటికి రెండు సార్లు చూసి 'ఈ చిత్రం విడుదల చేసే విషయమై ఇక నిర్ణయించవలసింది బొంబాయి పోలీసు శాఖ; అని అన్నారట. డైరెక్టర్ మణిరత్నం మాత్రం తాను జాగ్రత్తగానే తీశానని అంటున్నాడు. ఈ చిత్రం హిందీ వెర్షన్‌ను అమితాబచ్చన్

కొంప 11 పేజీలో

### సెన్సార్ కత్తెర పదునుకు చీలికలు, పీలికలై పోయింది!

## లీడర్

లీడర్ చిత్రాన్ని చూస్తుండే ప్రేక్షకుడు మొదటి సన్నివేశం నుండి చివరి వరకు అయోమయంలో పడిపోతుంటారు. వెండి తెరపై సన్నివేశాలు అర్థం కాకుండా చకచకా జరిగి పోతుంటాయి; దీనికి కారణం దర్శకుని అసమర్థతో; ఎడిటర్ విఫలతో ఆలోచిస్తే వీరిద్దరిని మించిన పదునైన సెన్సార్ కత్తెరని చెప్పవచ్చు. కథకుడు కూడా అయిన దర్శకుడు సమాజంలో జరిగే అంశాలనే కథగా ఎంచుకున్నాడు. రాజకీయ, పరిపాలన వ్యవస్థల పై ఎం.వి.ఎస్. హరనాథ రావు కలం ఈటెల్లాంటి మాటలు గుప్పించేసరికి ఎక్కడంటే అక్కడ సన్నివేశాలకు అంట కత్తెర పడిపోయింది. నటీనటుల కాంబినేషన్‌లో కథ కరుకుదనం తగ్గింది. టౌన్‌లో రౌడీషీటర్‌గా పేరుపొందిన హీరో ద్వితీయార్థంలో ఐ.పి.ఎస్ పూర్తి చేసి అదే టౌన్‌కు ఎ.ఎస్.పి.గా రాగలడా? సివిల్ సర్వీసుల నిబంధనలు అందుకు అంగీకరిస్తాయా? పేదల చేత దేవునిగా కీర్తింపబడే హీరో పై నేరం ఆపాదింప బడినప్పుడు న్యాయవ్యవస్థను ఆశ్రయించక అండర్ గ్రౌండ్‌కు పోవడంలో అర్థం లేదు. వృత్తిలో అత్యంత సమర్థునిగా పేరుగాంచిన పోలీస్ అధికారి కూడా హీరో ప్రవర్తన విషయమై సరిగా అంచనా వేయక పోవడం ఆయన శక్తి సామర్థ్యాలను ప్రశ్నింపజేస్తుంది. లైటింగ్ మార్పు చేర్పుల్లో లోపం - కెమెరామెన్ అసమర్థత వల్ల మరింత బట్ట బయలయ్యింది. సంగీత రొదలో సాహిత్యం మరుగున పడింది.

దేవరాజ్ (సుమన్) తానుండే కాలనీలోని పలువురి జీవితాలను సంస్కరించి లీడర్‌గా కీర్తింప బడుతుంటాడు. త్రిమూర్తులైన కలెక్టర్ చంద్ర (దేవ), ఎమ్మెల్యే కాటం రాజా (నర్రా వెంకటేశ్వర రావు), కాంట్రాక్టర్ సమ్మయ్య (తోటపల్లి మధు) వ్యాపారాలకు అతను అడ్డు తగిలే సరికి, తమకు అనుకూలమైన డి.ఎస్.పి

#### అల్లూరు రహీం

ద్వారా ఒక కేసును అతని పై బనాయిస్తారు. ప్రజల అండ వుండే దేవరాజ్ అంతు చూడను ప్రత్యేకంగా కరుకైన అధికారిగా పేరుగాంచిన సుభాష్ చంద్రబోస్ (కృష్ణంరాజు)ను కమీషనర్‌గా వచ్చేలా చేస్తారు. బోస్, దేవాను అరెస్ట్ చేయను రంగం సిద్ధం చేసే సరికి, అతను అండర్ గ్రౌండ్ వెళ్లిపోతాడు. దేవా ఆర్తులకు అండగా నిలిచే వ్యక్తని; అతను త్రిమూర్తుల పై

కొంప 11 పేజీలో

## ఉత్తరక్రియలు

మా అన్న

### శ్రీ మెట్టు రమణారెడ్డి గారు

కలివెలపాళెం

14.2.95 తేది మంగళవారం స్వర్గస్థులైనారు. వారికి దైవ సన్నిధిన చిరశాంతిని కలుగుజేయమని ప్రార్థిస్తూ, శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము

వారి ఉత్తరక్రియలు

| | | |
|---|---|---|
| 24.2.95 తేది | శుక్రవారం | శిలాప్రతిష్ఠ |
| 25.2.95 తేది | శనివారం | శిలోద్వాసన, ఎత్తురేవు |

నెల్లూరు మండలం, కలివెలపాళెంలోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులకు తెలియజేయడమైనది.



సరస్వతమ్మ - భార్య

- మెట్టు రామరెడ్డి

సోదరుడు : వీరారెడ్డి

కుమార్తెలు - అల్లుళ్లు:

ప్రమీలమ్మ - బొమ్మ ప్రభాకర్‌రెడ్డి
సుభాషిణి - దువ్వూరు వెంకటశేషారెడ్డి
ప్రియంవద - వై. వెంకటరెడ్డి
ప్రసూన - వేగూరు గంగాధరరెడ్డి

# నెల్లూరు పట్టణాన్ని తగలబెట్టిన చాళుక్య సేనాని!

## లక్ష ఏళ్ల నుంచి జన సంచారమున్నా నెల్లూరు ఒక వూరుగా ఏర్పడింది పల్లవుల కాలంలోనే!

### నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్రకు నూతన వ్యాఖ్యానం!

కొల్లూరి సాయిభక్త కేశవ
సాంకేతిక సహాయకుడు, పురావస్తుశాఖ, నెల్లూరు

(గత సంచిక తరువాయి)

### దువ్వూరు

ఈ గ్రామం నెల్లూరుకు 20కి.మీ. దూరంలో బుచ్చిరెడ్డి పాళెం మండలంలో వున్నది. ఈ గ్రామానికి ఉత్తరాన శ్రీ కోటేశ్వర స్వామి ఆలయం వద్ద పెద్ద పాటి దిబ్బలున్నాయి. ఈ మట్టిని తవ్వేటప్పుడు కొన్ని వెండి విద్ధాంక నాణాలు శాతవాహనులు, ఇక్ష్వాకులు, చోళ, చాళుక్య, తెలుగు చోళ, విజయనగరం, ముస్లిమ్, బ్రిటిష్ నాటి నాణాలు గ్రామస్థులకు దొరికాయి. వీటిని బుచ్చిరెడ్డి పాళెంలో డాక్టర్ సీతారామారావు సేకరించి భద్రపరిచారు. వెండి విద్ధాంక నాణాలు పరిశీలించిన డాక్టర్ ఐ.కె. శర్మ అవి మౌర్యుల కాలం నాటి వని తెలిపారు.

వీటిపైన 5 లేక 6 గుర్తులు కలవు. అందులో పద్మక్రం, కొండలు, సూర్యుడు, చెట్టు, స్వస్తిక్, ఏనుగు మొదలగునవి ముఖ్యమైన గుర్తులు. శాత వాహనులకు చెందిన రాగి, సీసపు నాణాలలో కొన్ని చంద్రశ్రీ శాతకర్ణి (క్రీ.శ.200-203) విగా గుర్తించారు. ఈ నాణాలకు బొమ్మవైపు ఏనుగు, బొరుసువైపు ఉజ్జయిని చిహ్నం వున్నాయి. మిగిలిన నాణాలపై సమాచారం సేకరింపబడలేదు.

### అల్లూరు

ఈ గ్రామం నెల్లూరుకు 29 కి.మీ. దూరంలో వుంది. ఇచ్చట ఒక ఇంటి నిర్మాణానికి త్రవ్వుచుండగా మట్టి ముంతలో వెండి విద్ధాంక నాణాలు దొరికాయి. వీటిలో కొన్నింటిని డాక్టర్ సీతారామారావు సేకరించారు. వీటిని పరిశీలించిన పురావస్తు శాఖాధికారి డాక్టర్ కార్తికేయ శర్మ అవి అన్ని విధాలా దువ్వూరు నాణాలను పోలి వున్నాయని తెలిపారు.

### కొడవలూరు

ఈ గ్రామం నెల్లూరుకు 15 కి.మీ దూరంలో వున్నది. శ్రీ పాలిచెర్ల రామిరెడ్డి భూమి లో త్రవ్వుతుండగా కొన్ని శాతవాహనుల కాలం నాటి నాణాలు దొరికాయి. వీటిని గురించిన పూర్తి వివరాలు తెలియ రాలేదు.

### నెల్లూరు పట్టణ ప్రాచీనత

నెల్లూరు జిల్లాగా అవతరించి రెండు వందల సంవత్సరాలు అయిన సందర్భంగా ద్విశతాబ్ది ఉత్సవాలు చేయతలంచి అప్పటి జిల్లా కలెక్టరు కె. రాజా ఒక కార్యాచరణ కమిటీని ఏర్పాటు చేశారు. ఆ కమిటీలో సభ్యులు కొందరు నెల్లూరు జిల్లాగా అవతరించి 200 సంవత్సరాలైతే అసలు నెల్లూరు పట్టణం ఎప్పుడు నిర్మితమయింది? ఎప్పటి నుండి మానవుడు ఇక్కడ తిరుగాడు తున్నాడు? నెల్లూరులో రాజకీయ యంత్రాంగమనేది ఎప్పటి నుండి మొదలయ్యింది? నెల్లూరు నుండి పరిపాలన సాగించిన మొదటి రాజవంశాలేవి? వంటి అనేక ప్రశ్నలు ఒక్క సారిగా లేవనెత్తారు. వీటిలో మనం కొన్నింటికి మాత్రం సమాధానం ఇవ్వగలం. మిగిలిన వాటి కొరకు తప్పని సరిగా గతంలోకి తొంగి చూడవలసిందే.

నెల్లూరు పట్టణ చరిత్రను తెలుసుకోవటానికి కూడా మనకు లిఖిత ఆధారాలు, శాసనాలు ఏమీ లేనందున పురావస్తు ఆధారాల సహాయంతో నెల్లూరు పట్టణంలో మానవుడు ఎప్పటి నుండి తిరుగాడు తున్నాడో తెలుసుకోవచ్చు.

నెల్లూరు పట్టణ పరిసరాలలో రాతియుగపు మానవుడు సంచరించినట్లుగా ఆధారాలున్నాయి. 1934-35 సంవత్సరంలో అమెరికన్ బాప్టిస్ట మిషన్ అనుపత్రిలో డాక్టర్‌గా సేవలందించడానికి వచ్చిన ఫ్రాంక్ ఎఫ్ మాన్లే అనే అమెరికా వాసి మొట్ట మొదటగా ఎబిఎం అనుపత్రి పరిసరాలలో పాతరాతి, మధ్యరాతి (సుమారు 1,50,000 నుండి 30,000 సంవత్సరాల మధ్య) యుగపు పనిముట్లను సేకరించారు. దీని వల్ల ఈ ప్రదేశంలో సుమారు లక్ష సంవత్సరాల నుండి మనిషి తిరుగాడు తున్నాడని తెలుస్తుంది.

క్రీ.శ. 1757 సంవత్సరంలో నెల్లూరు కోవూరులకు మధ్య అనకట్ట నిర్మాణం జరుగుతున్నప్పుడు మట్టితో చేసి కాల్చిన శవ పేటికలో కొన్ని ఎముకలు, మృణ్మయ పాత్రలు పదిలంగా అమర్చబడి ఉన్నవి బయట పడ్డాయి. ఇవి బృహత్ శిలాయుగం ( సుమారు క్రీ.పూ. 1000 సంవత్సరాల నుండి క్రీ.శ 400 సంవత్సరాల వరకు) నకు చెందిన సమాధులు. ఆ కాలపు ప్రజలు చనిపోయిన తమ బంధువులకు ప్రత్యేక రీతిలో సమాధులను నిర్మించేవారు. ఇటువంటి శవ పేటికలు బొన్నవాడలో (క్రీ.పూ. 300సంవత్సరముల) పురావస్తు శాఖ వారు జరిపిన త్రవ్వకాలలో బయల్పడ్డాయి. ఈ కాలానికి సంబంధించిన సమాధులు నెల్లూరు జిల్లాలో చాలా చోట్ల బయల్పడ్డాయి.

దీనినిబట్టి సుమారు క్రీ.పూ. 500 నుంచి 300 సంవత్సరాల నుండి నెల్లూరు పరిసర ప్రాంతాలలో జనావాసాలున్నట్లు తెలుస్తుంది.

అంతేకాక వేదాయపాళెం గ్రామానికి తూర్పు వైపున ప్రాచీన చారిత్రక కాలంనాటి పాటిదిబ్బ కనుగొనబడింది. అక్కడ క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందిన ఎరుపురంగు, నలుపురంగు, పూర్తి నలుపు రంగు కుండపెంకులు దొరికాయి. నెల్లూరు చెరువు ఒడ్డున ఎరుపు రంగు కుండ పెంకులు దొరుకుతున్నాయి. కాని పాటి దిబ్బ లభ్యం కాలేదు. బహుశా అది వర్షాలకు కరిగి పోయి వుండవచ్చు. మూలపేట, ఫత్తేఖాన్‌పేట, బారకాసు, కోట మిట్ట ప్రాంతాలలో క్రీ.శ. 6,8 శతాబ్దాలకు చెందిన మృణ్మయ పాత్రల శకలాలు లభ్యమవుతున్నాయి.

నెల్లూరు పట్టణం బహు ప్రాచీనమైనదని చెప్పటానికి ముఖ్య ఆధారాలుగా నాణాలు తోడ్పడుతున్నాయి. అందులో వెండి విద్ధాంక నాణాలు, రోమన్ చక్రవర్తుల నాణాలు ముఖ్యమైనవి. ప్రభుత్వ అనుపత్రి వెనుక, పొదలకూరు రోడ్డు ప్రక్కన నెల్లూరు చెరువు ఒడ్డున శ్రీ పుచ్చల పల్లి రఘురామిరెడ్డి (అడ్వకేట్) భూమి చదును చేస్తుండగా వెండి విద్ధాంక నాణాలు దొరికాయి. వీటిని పరిశీలించగా ఇవి ఐదు గుర్తులు కలిగి ఉన్నాయి. ఇటువంటి గుర్తులు కలిగిన నాణాలు అల్లూరు, దువ్వూరు గ్రామాలలో దొరికినట్లుగా ఇంతకు ముందే తెల్సుకున్నాము. వీటిని పరిశీలించిన డాక్టర్ ఇంగువ కార్తికేయ శర్మ ఇవి మౌర్యుల కాలం నాటివని తెలిపారు. అదే విధంగా నెల్లూరులో లభించిన నాణాలు కూడా మౌర్యుల కాలం నాటివని చెప్పారు.

1785-86 సంవత్సరాలలో మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నర్‌గా ఉన్న అలెగ్జాండర్ డేవిడ్ సన్ లేఖల వల్ల నెల్లూరుకు దక్షిణాన మద్రాస్ వచ్చే దారిలో ఒక రైతు రాతి నేలను దున్నుతుండగా కొన్ని రోమన్ చక్రవర్తుల నాణాలున్న మట్టి ముంత దొరికిందని తెల్సుకున్నాం. వారి వివరణ ప్రకారం అందులో ఒకటి రోమన్ చక్రవర్తి 'అంటోనియస్ పయస్' (క్రీ.శ.161) దిగా గుర్తించారు. ఈ నాణాలు లభ్యమైన ప్రదేశం వేదాయపాళెం ప్రాంతంలో ఉండి వుండ వచ్చునని కొందరి అభిప్రాయం.

ఇక పోతే రాజకీయ స్థావరంగా నెల్లూరు ఎప్పుడు వెలుగులోకి వచ్చింది అనే విషయమై కూడా ఎటువంటి సమాచారం లేదు. ఇంతకు ముందు వ్యాసాలలో శాతవాహనులు, ఇక్ష్వాకుల కాలంనాటి కోట గోడల శిథిలాలు దువ్వూరు, కోటమిట్ట (నేలటూరు) వుదూరు గ్రామాలలో ఉన్నాయని, బహుశా అవి ఆ కాలంలో రాజకీయ ప్రాముఖ్యత గల ప్రదేశాలు అయి వుండవచ్చుని పురావస్తు శాస్త్రవేత్తల అభిప్రాయంఅయితే నెల్లూరులో అటువంటి అవశేషాలు లభించలేదు. నెల్లూరు మొట్ట మొదటగా ఎప్పుడు వెలుగులోకి వచ్చింది అనే విషయమై చరిత్రకారులలో భిన్నాభిప్రాయా లున్నాయి.

డాక్టర్ సి.వి. రామచంద్రరావు అభిప్రాయంలో నెల్లూరు అనేది క్రీ.శ. 6 వ శతాబ్దానికి ముందు లేదని, తొలి పల్లవులలోని రెండవ సింహ విష్ణువు (క్రీ.శ. 575-600) కాని, మలి పల్లవులలోని సింహ విష్ణువు కాని ఈ పట్టణానికి పునాది వేసి వుంటారని; అందువల్ల దీనికి సింహపురమని పేరు వచ్చిందని చెప్పారు. కాని డాక్టర్. ఐ.కె.శర్మ అభిప్రాయం వేరుగా వుంది. ఒక వేళ పల్లవులే నెల్లూరు నిర్మాతలైతే వారి శాసనాలలో ఎక్కడా దాని ప్రస్తావన లేదు. అందువల్ల పల్లవులు నెల్లూరును నిర్మించలేదని వారి అభిప్రాయం. నెల్లూరు పట్టణంలో జైన మతం విస్తృతంగా వ్యాపించి వుండటానికి పట్టణంలో మూడు పార్శ్వనాథుని విగ్రహాలు, ఒక మహా వీరుని విగ్రహం లభ్యమైనాయి. ప్రస్తుత జిల్లా కలెక్టరు భవనం వున్న ప్రదేశంలో ఈ మహా వీరుని విగ్రహం దొరికింది. ఇచ్చటనే ఒక జైన 'బసది' శ్వేత సరోవరం ఉండేదని; ఈ ప్రాంతాన్ని మహా వీరుని లాంఛనమైన 'సింహం' కాపలా కాస్తూ వుండేవని; అందువల్ల దీనికి ' సింహ పురమను' పేరు వచ్చిందని వారి అభిప్రాయం.

ఇక శాసనాలలో నెల్లూరు అనే పదం మొట్టమొదటగా ఎప్పుడు వాడారో చూద్దాం. తూర్పు చాళుక్యరాజైన గుణగ విజయాదిత్యుని (క్రీ.శ.849) సైన్యాధ్యక్షుడైన పండంగుడు వేయించిన కందుకూరు శాసనంలో మొట్ట మొదటగా నెల్లూరు అనే పదం కనిపించింది. ఆ కాలంలో నెల్లూరు ప్రాంతంలో పరిపాలన చేస్తున్న బోయరాజులు తూర్పు చాళుక్యుల అధికారాన్ని ప్రశ్నించడం జరిగింది. వారిని అణచటానికి పండ్రంగుడు పెద్ద సైన్యంతో దండెత్తి వచ్చి, బోయ కొట్టాలను ఓడించి, నెల్లూరుపై దాడి జరిపి, దానిని తగుల బెట్టినట్లుగా కందుకూరు శాసనంలో చెప్పుకున్నాడు.

(తరువ పైవారం)

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ.50/-
విడిప్రతిరూ. 2/-

## 50 ఏళ్లక్రితం

3 వపేజీ తరువాయి

అసలు రాజా సంగతి అలావుంచి తహశీల్‌దార్ కొంపకు పోతే తలగొడితే మూడుదుగ్గాళ్లు చేయదు అతను గూడ గంటలకొలది నిలబెట్టి మాట్లాడట. ఈలాంటి దురాచారాలు ఎంత త్వరగా అంతరిస్తే అంత మంచిది యిరువురికీ.

### నెల్లూరు ముచ్చట్లు

#### పింగాణీ ఫ్యాక్టరి

అనంగనంగ నెల్లూరులో ఒక పరిశ్రమాగారం వెలకొల్పబడ్డది. అదే పింగాణీఫ్యాక్టరి. (సిరామిక్) మహా చక్కని, అందమైన, పనితనంగల పింగాణీ వస్తువులు తయారగుచున్నవి. మార్చిలో శ్రీంతి రామమూర్తిగారిచేత ప్రవేశోత్సవం జరుపబోతున్నారు. జిల్లాలోని ధనవంతులంతా చేయూతనిచ్చి యీ పరిశ్రమను ఉద్ధరించడం అవసరం. దీనికి కావలసిన ముడిసరుకు మస్తుగ యీ జిల్లాలో సిద్ధంగా వుంది.

అసలు విషయం మరిచా: 18 తేది రాత్రి మేనేజింగ్ డైరెక్టరు అల్లారెడ్డి శంకరరెడ్డిగారు ఫ్యాక్టరీలో ఒక డిన్నరు జేశారు. పెద్దలంతా వచ్చారు.

కమ్మని విందును సేవించి, నిర్మితమగు సామగ్రినంతా దర్శించివచ్చారు. ఇక్కడ తయారైన సామగ్రి విదేశీకమే తీసిపోవడం లేదుసుమా?

#### కోతులు

ఏమండి కమీషనరుగారూ టవునులో కోతుల బాధ జాస్తిగా వున్నది. కాయగూరలుగాని, పండ్లు ఫలాదులుగాని తినే ప్రాప్తంలేదుగదా! యిండ్లల్లోదూరి నానా చిలిపి పనులు చేస్తున్నవిస్వామీ! యిదివరకు కమీషనర్లు యీ వానర బలగాన్ని పట్టించి కిష్కిందాపురానికి పంపారు. తామూ గూడ అనుగ్రహిస్తే పౌరులు సుఖపడతారు మహాప్రభో!

#### ఆవులనుజంపి చెప్పులదానం

వెంకటగిరి ప్రభువు పురోహితునవద్ద బిడ్డపాలు దానం జేస్తున్నారట. రేపు కస్తూరిబా నిధిక్రింద జరిగే శిశురక్షణకేంద్రంలో బిడ్డలపాల ఖర్చులో సగభాగం తాను భరిస్తానన్నాడట. అసలు తన రాజ్యంలో గోవులకు మూతులుగట్టి రైతాంగాన్నంతా ఏడిపించి తద్రూపేణా వసూలుజేసిన డబ్బుతో ఎక్కడనో ఒకూళ్ళో నల్గురు పిల్లలకు పాలతో గొంతుదడుపుతాడట. స్వామీ! ఆవులజంపి చెప్పులదానం చేసే దానికంటే, గోవుల మూతులకు గట్టిన చిక్కాలు విప్పి అవి కడుపునిండా బొక్కెడు గడ్డి తినేటుజేస్తే పదివేలు.

#### ట్రంకురోడ్డు దుమ్ము

సూపరెంటు యింజనీరు రాక సందర్భంతో ఆయన కారు మొత్తంగా . నడవడానికని యెర్రదుమ్ము ట్రంకురోడ్డులో పోశారట. దాని బాధ వర్ణనాతీతం. టవునుహాల్ సెక్రటరిన్నీ, మునిసిపల్ చేర్మెనున్నూ అయిన లక్ష్మయ్య యింతమాత్రమన్నా పుణ్యం కట్టుకోలేదా!

## చిత్రసమీక్ష

9 పేజీ తరువాయి

తయారు చేసిన రిపోర్టును హెడ్‌కానిస్టేబుల్ ఆత్మారావు (సుత్తివేలు) కమీషనర్‌కు అందజేస్తారు. దేవా మంచితనాన్ని అలుసుగా గ్రహించిన కమీషనర్ అతన్ని అరెస్ట్ చేసినట్లు డ్రామా ఆడి, రహస్యంగా ఐపిఎస్ ట్రైనింగ్‌కు పంపుతారు. దేవా ట్రైనింగ్ పూర్తి చేసుకొని టౌన్‌కు వచ్చేసరికి పరిస్థితులు తారు మారవుతాయి. కమీషనర్ పోలీస్ శాఖకు వాంటెడ్ క్రిమినల్ అయి వుంటారు. దీనికి కారణం దేవా అందించిన ఫైలే. దాని ఆధారంగా కమీషనర్ త్రిమూర్తుల పై విజృంభించేసరికి వారు కమీషనర్ ఫ్యామిలి పై సెంటిమెంట్ దెబ్బలు కొట్టి, అతనే హంతకుడని సాక్ష్యాలు సృష్టిస్తారు. దీనితో కమీషనర్ అండర్ గ్రౌండ్‌కు వెళ్లిపోతాడు. దేవా ఎ.ఎస్.పి.గా తన తెలివిని వుపయోగించి పూర్వాశ్రమంలో తనను సంస్కరించిన కమీషనర్‌ను నిర్దోషిగా నిరూపిస్తారు.

మాటల రచయిత ఎం.వి.ఎస్. హరనాథ రావు రాజకీయ నాయకుల పై చురకలు విసరడంలో దిట్ట. చెన్నారెడ్డి మంత్రి వర్గంలో పశువులు లేకుండా పాడి పరిశ్రమాభివృద్ధికి ప్రత్యేక మంత్రిని నియమించిన సంఘటనను ఈ చిత్రంలో ట్విస్ట్‌గా కామెడీకి వుపయోగించారు. అధర్మం భగవంతునికంటే బలమైంది; నేటి సమాజంలో ఆటవిక న్యాయమే బెటర్ వంటి డైలాగులు ఆలోచింప చేస్తాయి. నటీనటుల్లో సుమన్, కృష్ణంరాజు గ్లామర్‌గా కనిపిస్తాయి. హీరోయిన్ ప్రియారామన్ పాటలకే పరిమితం. మాటల రచయిత కోటపల్లి మధు విలన్‌గా పనికివస్తారు. పాత తరం హీరోయిన్ భారతి, బాబూమోహన్, జయలలిత పాత్రలు నామమాత్రంగానే నిలిచాయి. సెల్యూలాయిడ్ దర్శకుడు పి.ఎన్. రామచంద్ర రావు తొలిసారిగా భారీ చిత్రానికి దర్శకత్వం వహించినా, పలు కారణాల వల్ల అదృష్టం కలిసి రాక పోవడంతో చిత్రం హిట్ కాలేక పోయింది.


### బలాది లేహ్యం

నరముల బలహీనత, గుండె దడ, ఆయాసము, బ్లడ్ ప్రెషరు, మొదలగు వ్యాధులపై పనిచేయును. తీక్షత్వ, రక్తపుష్టి, బలము ఉత్సాహమును కలిగించును. 200 గ్రాముల సీసా రూ.40/- మా వద్ద ప్రశస్త ఆయుర్వేద ఔషధములు లభించును.

జనార్దన ఆయుర్వేద ఫార్మసీ
4/607, ఉస్మాన్‌సాహెబ్‌పేట,
నెల్లూరు -524 002.


**In the Court of the Subordinate Judge**
**Madanapalle**
O.E.P. 27 / 93 : O.S. 95/88

డి.ఆర్. సుందరరాజు -డిక్రీహోల్డరు
యస్. మొహమ్మద్ గౌస్ -జె.డి.ఆర్.

### వేలం నోటీసు

పై దావాలోని జె.డి.ఆర్.కి చెందిన లేల్యాండ్ AAC 2297 నంబరు కల లారీ మదనపల్లెకి చేరిన కదిరి రోడ్డులో వుండు శ్రీ భాగ్యలక్ష్మి మిల్లులో డిక్రీహోల్డరు స్వాధీనంలో వున్నది. సదరు లారిని కోర్టు వారు 8.3.1995 వ తేదిన వేలం వేయుటకు వుత్తర్వు జారీ చేసినారు. కావున వేలంలో పాడదలచు కొన్నవారు మదనపల్లి భాగ్యలక్ష్మి మిల్లులో వుండు AAC 2297 లేల్యాండ్ లారిని తనిఖీ చేసుకొన వచ్చును. వేలంలో పాడదల్చు కొన్నవారు 8.3.1995 వ తేదిన పాడవచ్చును.

C. Thimma Reddy
Advocate for Decree Holder

### వరి రకాలు

4 పేజీ తరువాయి

చౌడు భూములకు కూడా అనువైన రకం.

#### ఐ.ఇ.టి - 9994

టుంగ్రోవైరస్‌ను తట్టుకోగల ఈ రకం కాలపరిమితి 115 రోజులు. గింజ అతినాణ్యత గల్గి, దిగుబడి ఎకరానికి మూడు పుట్లవరకు నిచ్చి 'రాశి' కన్న మిన్నయైనది.

#### ఎం.టియు- 7014

ఈ రకం కాలపరిమితి 125 రోజులు. దిగుబడి ఎకరానికి మూడు పుట్లు నిస్తుంది. గింజ నాణ్యతతో పొడవుగా వుంటుంది. అగ్గి తెగులును తట్టు కొంటుంది.

#### ఐ.ఆర్.-64

ఈ రకం పంటకాలం 120 రోజులు. మొక్కలు మధ్యస్థ పొడవుతో పడిపోక వేసిన ఎరువులకు తగిన ప్రతిఫలమిస్తుంది. గింజ పొడవుగా అతి నాణ్యత గల్గి ఎకరానికి మూడు పుట్ల దిగుబడి నిస్తుంది.

అగ్గి తెగులును తట్టుకుంటుంది గాని ఉల్లికోడు, మోము పెన్ను, దోమపోటు, టుంగ్రో వైరస్ లను తట్టుకోలేదు. నిద్రావస్థ కోత సమయం నుండి 3-4 వారాలు వుంటుంది.

#### రాశి (ఐ.ఇ.టి-144)

రైతాంగానికి చిరపరిచితమైన ఈ రకం కాలపరిమితి 115 రోజులు. గింజముతగా వుంది. దిగుబడి ఎకరానికి 2 1/2 -3 పుట్ల వరకు నిస్తుంది. నీటి ఎద్దడిని, జింకు ధాతువు మరియు భాస్వర లోపాలను తట్టుకొంటుంది. అగ్గి తెగులును టుంగ్రోవైరస్‌లను తట్టుకోనలేదు. పం. పంటకాలమందు పైరు తడిస్తే మొలకెత్తే స్వభావం వుంది.

రైతులు ఈ వివరాలను దృష్టిలో వుంచుకొని, తమకు అనువైన వరి రకాన్ని ఎంపిక చేసుకొని తగిన యాజమాన్య పద్ధతులను సస్య రక్షణాచర్యలను గైకొని అధిక దిగుబడులను సాధించ గలరని ఆశిద్దాం!

### సినిమా

9 పేజీ తరువాయి

రెండు కోట్లకు తీసుకున్నారు. ఆయన కూడా ఏ అభ్యంతరం లేకుండా విడదలపడానికి విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

#### మా ఇంట్లో ఇండియా

" ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్రాల నుంచి ఒక్కొక్కరుగా నలుగురు యువతులు ఒక ఇంటికి కోడళ్ళుగా వస్తారు. తన గృహం మన భారత దేశంలా జాతీయ సమైక్యతా భావంలో వుండాలని మామగారి ఆశ. సూక్ష్మంగా ఇదీ కథ'' అని ఈ చిత్ర దర్శకుడు భరత్ చెప్తున్నప్పుడు గతంలో శాంతారాం రూపొందించిన 'తీన్‌బత్తి చార్ రాస్తా' చిత్రం గుర్తుకు రాక మానదు. కథ, మాటలు : ఎం.వి.ఎస్ : హరనాథరావు; సంగీతం : కోటి.


National నిప్పో స్పెషల్

నిప్పో స్పెషల్ ఎప్పుడూ సరిక్రొత్తగా 'టాప్‌సీల్'తో నాణ్యతకి సంబంధించిన I.S.I చిహ్నంతో వస్తుంది. టాప్‌సీల్ వున్న మొట్టమొదటి పేపర్ క్లాట్ బ్యాటరీ నిప్పో స్పెషల్. ప్రపంచ ప్రసిద్ధి చెందిన మట్సుషిట ఎలక్ట్రిక్ -జపాన్‌వారి (నేషనల్ పానసోనిక్ టెక్నిక్స్ ప్రొడక్ట్స్ తయారీదారులు) సాంకేతిక విధానంతో తయారు చేయబడి, అత్యుత్తమంగా పనిచేస్తుంది. దీర్ఘకాలం మన్నుతుంది.

NIPPO SPECIAL
MULTI PURPOSE
Long Life
National
MADE IN INDIA

National నిప్పో

ప్రపంచ ప్రసిద్ధి చెందిన
జపాన్‌లోని మట్సుషిటా ఎలక్ట్రిక్‌వారి
సాంకేతిక విధానంతో తయారుచేయబడింది.



# యువతకు అవకాశం ఇవ్వండి-
# అభివృద్ధికి పట్టం కట్టండి!



తోటపల్లి గూడూరు మండల జిల్లాపరిషత్ ప్రాదేశిక నియోజకవర్గం

## ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా

అభ్యుదయ రైతు యువకుడు, విద్యావంతుడు, ప్రజాసేవాభిలాషాపరుడు

మాజీ జిల్లా కాంగ్రెస్ సహాయకార్యదర్శి, పెద్దాయనగా సుపరిచితులైన
స్వర్గీయ వేమారెడ్డి వెంకురెడ్డి మనుమడు

## గూడూరు శివకుమార్‌రెడ్డి, బి.ఇ.

వేదురుమల్లి జనార్ధన రెడ్డి, మాగుంట సుబ్బరామ రెడ్డి, ఆనం సంజీవ రెడ్డి, సివి శేషారెడ్డి, జెకె రెడ్డి తదితర పెద్దలందరి సమష్టి కృషితో, ఆశీర్వాదంతో, అభిమాన పాత్రతతో పోటీ చేస్తున్నారు.

ఆయనకు, ఈ దిగువ పేర్కొన్న మండల ప్రాదేశిక నియోజకవర్గం అభ్యర్థులకు

## హస్తం

గుర్తు పై పవిత్రమైన ఓటు ముద్ర వేసి గెల్పించ ప్రార్ధన.





గూడూరు శివకుమార్‌రెడ్డి, బి.ఇ.

| | |
|---|---|
| నరుకూరు | మోచర్ల రమణయ్య |
| పేడూరు | తిరుమూరు విజయసేనారెడ్డి |
| సౌత్ ఆములూరు | వేళ్ళ సిద్దయ్య నాయుడు |
| పోట్లపూడి | పిండిబోయిన చంద్రశేఖరయ్య |
| వెంకన్నపాళెం | శ్రీమతి మేరీ నిర్మల |
| కోడూరు I | ఏకొల్లు రామచంద్రయ్య |
| కోడూరు II | తోటకూర సూలమయ్య |
| ఈదూరు | యాకసిరి నాగమణి |
| తోటపల్లిగూడూరు | యంబేటి హైమావతి |
| ఇసకపాళెం | కాటారి చిరంజీవమ్మ |
| వరిగొండ I | ఆలపాక చంద్రయ్య |
| వరిగొండ II | అన్నం ఈశ్వరమ్మ |
| వరకవిపూడి | మారంరెడ్డి శిరీషరెడ్డి |





- తోటపల్లి గూడూరు
కాంగ్రెస్ అభిమానులు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press: OFFSET Printing at Navagara Paper Prodv*s (India) Ltd.,